# ఆంధ్రపత్రిక

| సంవత్సరచందా<br>రు. 12-0-0<br>విడిప్రతిక<br>4 అణాలు | ప్రతిబుధవారము ప్రకటింపబడును.<br>ఒరులేయవియొనరించిన నరవర, యప్రియము తనమనంబున కగు దా<br>నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్<br>(మహాభారతము) | సంపుటము **42**<br>సంచిక **46** |
|---|---|---|

**Founder : K. NAGESWARA RAO**

విక్రృతి సంవత్సర నిజాషాఢ శుద్ధ చవితి బుధవారము



హస్తినాపుర, అహిచ్ఛత్ర, తిలపట్న ప్రాచీన నగర ప్రాంతాలలో దొరికిన ప్రాచీన చరిత్రాత్మక చిహ్నాలు. ఢిల్లీకి 13 మైళ్ల దూరంలో తిలపట్న ప్రాంతంలో ప్రాచీన చరిత్ర పరిశోధక శాఖవారికి పై పాత్రా శిథిలాలు దొరికాయి. ఈ ప్రాంతం క్రీ. పూ. 6 వ శతాబ్దినాటికే జనావాసముగానున్నట్లు చెబుతున్నారు. భారత యుద్ధానికి పూర్వదశలో, పాండవులకూ కౌరవులకూ జరిగిన సంధి రాయబారాలలో ఈ తిలపటాన్ని తమకు యిప్పించవలసినదిగా పాండవులు కోరినట్లు పురాణగాథ.




# ఆంధ్రపత్రిక

1950-వ సం॥ జూలై నెల 19-వ తేది బుధవారము


## దేశీయ ఆర్థిక వ్యవస్థ

దేశపరిపాలనాధికారము కాంగ్రెస్‌వారి హస్తగతమైనది మొదలు మతకలహములు, కాశ్మీర్ యుద్ధము మొదలగు సమస్య లుత్పన్నమై ఆర్థికసమస్యాపరిష్కారమునకు తగినంత యవకాశము లభింపలేదు. కాని ఆహారక్షామము, ఆర్థికదుస్థితి, నానాటికి తీవ్రతరమగుచున్నందువల్ల వీనిపరముగ ప్రభుత్వము విశేష ద్రవ్యమును వెచ్చింపవలసివచ్చినది.

అధికాహారోత్పత్తిఉద్యమమునకు, పారిశ్రామికాభివృద్ధికి, ప్రాజెక్టుల నిర్మాణమునకు వెచ్చించుచున్న ద్రవ్యమునకు తగు ఫలితములు ఇప్పటికిని కానరావు.

వివిధఅభివృద్ధికార్యక్రమములు సమీకరించబడక, అనిర్దిష్టలక్ష్యములతో నిర్ణయమైనందువలననూ, నిర్ణయమైన కార్యక్రమములు సవ్యముగానిర్వహింపజాలకుండుటవల్లనూ పరిస్థితి బాగుపడలేదని హేతువులుగా చెప్పబడినవి.

కావున సర్వరంగములయందునూ అభివృద్ధికార్యక్రమములను సమగ్రముగ సమీక్షచేసి, ప్రస్తుత పరిస్థితులలో ఆచరణసాధ్యమైనట్టి సూచనలను చేయవలసినదిగ భారతప్రభుత్వము 1949 ఏప్రిల్‌మాసమున శ్రీ వి. టి. కృష్ణమాచారిగారి అధ్యక్షతను ఫిస్కల్‌కమిషన్ ఒకదానిని నియమించినది. ఈ కమిషన్‌వారు సమర్పించిన నివేదికను భారతప్రభుత్వము పరిశీలించనున్నది.

నివేదికాంశములు ప్రచురింపబడినంతనే దేశమున సర్వవర్గములవారునూ హర్షించిరి. ఇతఃపూర్వకార్యక్రమములవలె గాక ప్రస్తుతనివేదికలో గల వాస్తవికత, ఆచరణసాధ్యతలే దేశమున కాశాభావమును కల్గించుటకు హేతువులైనవి. ఏ రాజకీయార్థిక తత్వమునకునూ చెందని ఆర్థికశాస్త్రనిపుణులు రచించినందువలననే, నివేదికయందు ఎట్టి యాడంబరమును విసుపుపుట్టించదు.

పరిష్కారవిధానమును సూచించుటకుముందు సమస్యను పూర్తిగా యవగాహన మొనర్చుకొనుట ప్రధానము. ఇక్కడగూడ పూర్వకార్యక్రమములకునూ ప్రస్తుత కార్యక్రమమునకునూ వ్యత్యాసమున్నది. కృష్ణమాచారి కమిషన్ వారు సమస్యస్వరూపమును మొదట తెలిపిరి. మన దేశమున మొదట కానవచ్చునవి నిరుద్యోగము, అయోమయముగ నున్న వృత్తియవలంబనవిధానము, దుష్కరసేద్యవిధానము, సౌష్ఠవములేక తీరుతెన్ను తెలియని పారిశ్రామికాభివృద్ధి, కుటీరపరిశ్రమల క్షీణదశ. వీనిలో ప్రతియొక్క సమస్యపరిష్కారమును తదితర సమస్యల పరిష్కారముపై యాధారపడియున్నదను సత్య మింతవరకును పరిపాలకులచే విస్మరింపబడినది. కావుననే ఏ సమస్యను పరిష్కరింపబూనుకున్నను ఆచరణసాధ్యము కాకుండపోయినది. ఈ విషయమును గుర్తించియే కృష్ణమాచారికమిషన్ ప్రధానమైన సూచనలను చేసినది. అన్నిటికంటెను పారిశ్రామికాభివృద్ధి బొత్తిగ కుంటుపడుచున్నందున ఈ సమస్యపై నివేదికలో చాలభాగము వినియోగింపవలసివచ్చినది.

సహజసంపదలకు, వ్యావసాయికపారిశ్రామికాభివృద్ధియవకాశములకు మనదేశము అమెరికాను పోలియున్నది. కాని ద్రవ్యపరిస్థితి భౌతికశాస్త్రవిజ్ఞానము, జనసంఖ్యల విషయమున ఉభయదేశములును పూర్తిగ వ్యత్యస్తములు. ఈ మూడు విషయములలోనూ మనదేశము అన్యఆసియాదేశములను పోలియున్నది. కాబట్టి మన అభివృద్ధికార్యక్రమములకు

ఏ దేశవిధానమునూ అనుకరణయోగ్యములు కాజాలవు. వ్యవసాయముతోబాటు పరిశ్రమలు గూడ అభివృద్ధి పొందినగాని ప్రజలందరకూ, వృత్తి, జీవనభృతి, వస్తుసంపద లభించుట యసంభవము కావుననే మన దేశఆర్థికవ్యవస్థయందు వ్యవసాయమున కాపాదించవలసిన ప్రాధాన్య మెంతో వాస్తవికదృష్టితో పరిశీలించవలసి వచ్చినది.

వ్యవసాయవిధానము సంస్కరింపబడి, ఉత్తమ పరికరములను వినియోగించి, ఫలములను వృద్ధిపరచవలసినచో, ఈ వృత్తిపై యాధారపడియుండవలసిన జనసంఖ్య పరిమితము కావలసియున్నది. ఆ వృత్తికి ద్రవ్యసహాయ మవసరము కాగలదు. వ్యవసాయముపై యాధారపడియుండువారి సంఖ్యను పరిమితము చేయవలెనన్నచో రానున్న ఇరువది వత్సరములలో 15 లక్షలమందికి క్రొత్తవృత్తులను చూపవలసియుండును. మన పరిశ్రమలు మొత్తము 30 లక్షలకంటె యధిక జనులను నియోగించజాలకున్నవి. వీరి సమస్య గాక, ఏడాదిలో దాదాపు ఆరుమాసములపర్యంతము వృత్తిలేని వారున్నారు. వీరికి అదనపువృత్తిని కల్పించవలసియున్నది.

ఈనిర్వృత్తి, నిరుద్యోగసమస్యలను పరిష్కరించుటకు చిన్నచిన్న యంత్రపరిశ్రమలను, కుటీరపరిశ్రమలను ప్రభుత్వము ప్రోత్సహించుట యత్యవసరమనియూ, ధనసహాయ మిచ్చుట గూడ అవసరమగు ననియూ ఫిస్కల్ కమిషన్ నివేదించినది. వీనినిమిత్తము ప్రతి రాష్ట్రముననూ అధికారస్థిత కార్పొరేషనులు నెలకొల్పబడవలెనని వారు సూచించిరి. వస్తుసంపద వృద్ధిపరచి, నిరుద్యోగమును నిర్మూలించుటకు వ్యవసాయమునను, పెద్దపరిశ్రమలయందును నియమింపబడగా మిగిలినవారికి ఈ చిన్నపరిశ్రమలు చేతిపరిశ్రమలు సమృద్ధిగ పని గల్పించగలవనుటకు మన పూర్వవ్యవస్థయే తార్కాణము. గాంధీమహాత్ముడు చెప్పినట్లు ప్రజల ప్రశాంత జీవనమునకు వ్యవసాయము చిన్నపరిశ్రమలే యాధారములు. ఈ స్థితి కనువుగ మన దేశమున ప్రతి ప్రాంతమునను సహజసంపద సమృద్ధిగ గలదు.

కాని మన దేశసహజసంపదను, ముఖ్యముగ ఖనిజసంపదను ప్రజల జీవనసదుపాయమునకు వినియోగపడవలెనన్నచో పెద్ద పరిశ్రమల అభివృద్ధి అత్యంతావశ్యకము. పెద్ద పరిశ్రమల నభివృద్ధిపరచుటకు నేడు పెట్టుబడికి ద్రవ్యలోపము, ధనవంతుల సంకోచము, యంత్రపరికరముల లోపము, వానిని నడుపు నిపుణుల కొరత, కొంతవరకు ప్రభుత్వము విధించుచున్న సుంకములు, ప్రధానయాటంకములుగ నున్నవి. ఈ ఆటంకములను తొలగించుటకు ఫిస్కల్ కమిషన్ వారు కొన్ని ప్రధానసూచనలను చేసిరి. ప్రస్తుతరక్షణసుంకవిధానమున పరివర్తన తేవలసిన యగత్య మున్నదని వా రనిరి. ఇంతవరకును దేశమున పారిశ్రామికవస్తుసమృద్ధితో నిమిత్తములేకుండ, ధరల పెరుగుదలనుగురించి కూడ యోచించకనే టారిఫ్ కమిషన్ వారు పరిశ్రమలకు రక్షణ నిచ్చుచున్నారు. కోరిన పరిశ్రమదారులకు రక్షణ నిచ్చుట కోరనివారికి ఇవ్వకుండుట జరుగుచున్నది. రక్షణపొందిన పరిశ్రమలవారు ప్రజలకు వస్తువులను సమృద్ధిగ నిచ్చు బాధ్యతను గమనింపరైరి. తమ పరిశ్రమలలో లాభార్జనయే ప్రధానలక్ష్యముగ నాణ్యముపట్ల శ్రద్ధ వహించనందున, ఎన్ని సంవత్సరములు రక్షణ పొందినను విదేశపరిశ్రమలతో పోటీచేయగల దక్షత నార్జించలేదు. కావున ఇకనుంచి దేశపరిస్థితులనుబట్టి యవసరమగు పరిశ్రమలకెల్ల రక్షణ నొసగవలెననియు, రక్షణ పొందు పరిశ్రమలు దేశముపట్ల బాధ్యతను గుర్తెరుగునట్లు నిర్బంధములను విధించవలెననియు కమిషన్ వారు నివేదించిరి. ఏవో కొన్ని పరిశ్రమలకు రక్షణ నిచ్చుటకు బదులు, ఏవో కొన్ని మినహా అన్నిటికినీ రక్షణ నొసగు పరిస్థితిలో పెట్టుబడిదారులు పారిశ్రామికాభివృద్ధికి ప్రభుత్వము నిర్ణయించు కార్యవిధానమును అనుసరించుటకు సమ్మతించవలెననియు, ప్రభుత్వనిర్బంధములకు పరిశ్రమలయజమానులు లోబడుటను సమ్మతించుట ధర్మమనియు కమిషన్ వా రనిరి. స్వేచ్ఛావ్యాపారము ప్రధానముగాగల దేశములయందే రక్షణసుంకములు, ప్రభుత్వనిర్బంధములు నివార్యమైనప్పుడు, పారిశ్రామికాభివృద్ధికి విశేషకృషి చేయవలసియున్న మన దేశమున మరింత యవసర మగుచున్నవి. ఈనిర్బంధములు అభివృద్ధికి ప్రతిబంధకములు గాక దోహదము నీయగలవని నివేదికాంశమువలననే స్పష్టపడుచున్నది.

అధికారసముపార్జనము, రాజకీయ ప్రాబల్య సాధనలే కేవల మాశయములుగ పరిగణించని ఏవర్గమై

నను సహకరించి యనుసరించుటకు ఈ నివేదిక యవ కాశ మిచ్చుచున్నది. ఆచరణసాధ్యమైన కార్యక్రమములను చూపినచో, ప్రభుత్వోద్యోగులును ఉత్సాహవంతులై కృషిచేయగల్గుదురు. కావున భారతప్రభుత్వము త్వరపడి నివేదికను పరిశీలించి, క్రమక్రమముగ సూచనల నమలులో పెట్టినచో ప్రజలుగూడ సహకరించగల రనుటలో సందేహము లేదు.

---

# నెహ్రూ శాంతిప్రయత్నము

---

"కొరియాయుద్ధమును వెంటనే ఆపివేయవలె" నన్న భద్రతామండలి తీర్మానము నామోదించినప్పటి నుండి, భారతప్రధాని, తా నవలంబించు నీతిమార్గము లోని ఏకగామిత్వమును, తన తాటస్థ్యవిధానము లోని చైతన్యశక్తిని, పునః పునః ప్రదర్శించుచునే వచ్చెను. ప్రపంచమును యుద్ధవిముఖ మొనర్చుటకు తనకృషిలోప ముండదని నివేదించెను. ఈకృషికి, శాంతి, అహింస, ధర్మములు ఆదర్శములు. ఏనాటికైన ప్రపంచ శాంతికై కృషిచేయగల ఏకైక సంస్థ, ఐక్యరాజ్యసమితియే అన్న అచంచలవిశ్వాసము, మూలాధారము.

యుద్ధము నాపుచేయుటకు, ఐక్యరాజ్యసమితిని మరల సంపుష్టమొనర్చి, నిష్పాక్షికమగు సంస్థగ బలపరచుటకు, చేయవలసిన కృషిభారమంతయు నేడు తటస్థరాజ్యములపై బడినది. ఈ తటస్థవిధానము జడ విధానముకాక, సచైతన్యమనుటకు, ఈకృషియే నిదర్శనము.

కమ్యూనిస్టు చైనాయే, చైనాతరపున ఐక్యరాజ్య సమితిలో నేడు ప్రాతినిధ్యమువహించుట కర్హతగలది యన్న నిర్వివాదాంశమును, అమెరికాప్రోద్బలమున సమితి దాటవేసినది రష్యా సమితిని బహిష్కరించుటకు ఇది ప్రత్యక్షకారణము. ఈ కారణమును తొలగించుటలో సమితికి మరల బలము చేకూరగలదు.

దీనికై. అగ్రరాజ్యముల ప్రతిష్ఠ లద్దురాకుండ, వారిని సమావేశపరచుటకు, వారు సమాధానవిధానమును అవలంబించుటకై, తటస్థకృషి చేయవలసిన బాధ్యత తటస్థరాజ్యములపై పూర్తిగ నున్నది. ఈ బాధ్యతా నిర్వహణముననే, ఫల మెట్లుండునన్న అధీరత్వము లేకుండ, కార్యశూరత్వముతో, భారతప్రధాని, స్టాలిన్, ట్రూమన్, అట్లీ, ప్రభృతులకు ముగ్గురకును స్వయముగ శాంతివిజ్ఞాపనము లంపెను. స్టాలిన్‌వద్ద నుండి సమాధానము వచ్చినది. రష్యన్‌వర్గములు, నెహ్రూ శాంతిప్రియత్వమునకు విముఖత్వమును చూపినట్లు లేదు.

నెహ్రూకృషితో, చేయిగలుపు విధానములోనే బ్రిటిషు పార్లమెంటు సభ్యుల తీర్మాన మొకటి గలదు. ఇక కొరియాయుద్ధములో ఐక్యరాజ్యసమితి సిబ్బందిగ అమెరికన్ సైన్యము తగినంత విజయము చేకూర్చుకొనని సమయమున, రష్యాతో రాజీబేరము లాడుట అమెరికాప్రతిష్ఠకును, తద్ద్వారా సమితిప్రతిష్ఠకును భంగకరమేమోనని అమెరికాబ్రిటను లాలోచించుచున్నవి. ఐక్యరాజ్యసమితిలోని అగ్రసభ్యులు, కేవలము బలీయుల మనిపించుకొందమన్న ప్రతిష్ఠకై, సమాధానవిధానముల త్రోసిపుచ్చుటను, మించిన అప్రతిష్ఠ సభ్యులకును, తద్ద్వారా సమితికిని, వేరుగ నుండబోదు. ప్రతిష్ఠలకై యుద్ధములను సాగించుకొను పని పెట్టుకొన్న ప్రపంచశాంతికాముకత్వము 'మొదలంటగ దెబ్బతిన గలదు.

భారతదేశమును, భారతప్రధానిని, మహాత్మాగాంధీ అనుచరు లగుటవలనను శాంతిప్రియులు నిష్పాక్షికులు నగుటవలననే, అమెరికా మొదలగు అగ్ర రాజ్యములు గౌరవించినవి. నేడా గౌరవమును యథార్థ మొనరింపవలె నన్నను, తమ ఆదర్శములలో కెల్ల ప్రపంచశాంతిప్రియత్వమే ఉత్తమోత్తమమని ప్రపంచమునకు సుస్పష్టమొనరింపవలెనన్నను, అగ్రరాజ్యములు పండిట్ నెహ్రూ విజ్ఞాపనను గౌరవింపక తప్పదు. శాంతికై పండిట్ నెహ్రూకృషికి తమ కృషిని జోడించుట విధాయకము.

---

# విషయానుక్రమణిక
## 19 జూలై 1950

# మనదేశం

## ఉత్సవాలు *

మతం ఒకరికి మనస్సును కలతబేరిస్తే ఒకరికి ఉన్మాదావేశాలు రెచ్చగొట్టడం కద్దు. ఈద్ పండుగ మహమ్మదీయులందరికీ భారత దేశంలోనూ పాకిస్తాన్‌లోనూ ప్రశాంతంగా గడిచిపోయింది. జగన్నాథ రథోత్సవం పూరీ పుణ్యక్షేత్రంలో కొందరు సాధువులలో ఘోర గుణాన్ని ప్రకోపింపచేసింది. వందలాది యాత్రీకులచేత లాగబడే జగన్నాథరథాన్నెక్కడానికి యత్నించిన కొందరు సాధువుల్ని పోలీసులు అటంకపెట్టారు. సాధుజనత్వానికి అఘాతం తగిలింది కాబోలు రెండువందలమంది సాధువులేకమై కొమ్ముచెంబులూ త్రిశూలాల్తో పోలీసుల నెదుర్కొన్నారు.

పోలీసుల టోపీలే సొట్టపడ్డవో, కొమ్ము చెంబులే సొట్టపడ్డవో ఫలితం మాత్రం సాధువులికూడా సామాన్యసంసారులకు వలెనే కారాగారదండన విధించబడింది.

## విమాన ప్రమాదం *

కాశ్మీరంలో సైనికోపసంహరణవిషయమై ఢిల్లీలో ఉభయ దేశాల ప్రధాన మంత్రులు, భద్రతామండలి నియమించిన మధ్యవర్తి సర్ ఓవెన్ డిక్సన్ సమాలోచనలు ప్రారంభించడానికి సరిగ్గా మూడు రోజులముందు పఠాన్‌కోటవద్ద విమానం కూలి అంతర్జాతీయ సైనికాధికారులు, నెహ్రూ కార్యదర్శి తదితరులు మృతిచెందారు. డిక్సన్‌కు సైనిక విషయ సలహాదారుగా నియమితుడైన అమెరికన్ సైనికోద్యోగి జనరల్ హోడెస్‌కి ఈ ప్రమాదం కాస్తలో తప్పింది. ఇండియన్ నేషనల్ ఎయిర్వేస్‌కి చెందిన కోటా ప్రయాణీకుల విమానం శ్రీనగర్‌కి వెడుతూ, దారిలో చాకీనది సమీపంలో వర్షపాతం మూలంగా కూలిపోయింది. మృతిచెందిన వారిలో ముగ్గురు భారతసైనికోద్యోగులు, పండిట్ నెహ్రూ కార్యదర్శి యైన శ్రీ ద్వారక్‌నాథ్ కచ్రూ, ఐక్యరాజ్యసమితివారి కాశ్మీర్ సైనిక పర్యవేక్షకులు ముగ్గురు ఉన్నారు. మొత్తం ప్రయాణీకులు 18 మంది, పైమానికులు నలుగురూ మృతిచెందారు.

## ధరల పెరుగుదల *

ఎక్కడో కొరియాలో యుద్ధం సంభవించిందని అమెరికాలో వలెనే భారత దేశంలో కూడా వస్తువుల ధరల్ని వ్యాపారులు పెంచేస్తున్నారు. చిక్కినంతమటుకు వస్తు సామగ్రిని చీకటిగదుల్లో దాచేస్తున్నారు. దిగుమతి చేసుకోనక్కర్లేని నూనెలు మిరపకాయలు పప్పులు నెయ్యి కూరల ధరలుకూడా ఎందుకు పెరగాలో ఎవరికీ తెలియదు. ప్రస్తుతధరలుకూడా అక్కడక్కడ పెరిగాయి. కొన్ని మిల్లుల్లో డబ్బు తే ఎక్కువ ధరలకి అమ్మడం, ఉన్న మట్టుకు దాచెయ్యడం జరిగింది. కంట్రోల్స్ తీసెయ్యాలని అడిగినంతసేపు పట్టలేదు వ్యాపారుల నీతిబండారం బైటపడ్డానికి. మందుల ధరలు మరీ మితిమీరిపోతున్నాయి. కాని ఈమారు ప్రభుత్వం కఠినచర్యలు తీసుకుని వ్యాపారుల స్పెక్యులేషన్ జూదపు ఆటలు కట్టించగలరని మంత్రులు మహతాబ్ మున్షీ గట్టిగా చెప్తున్నారు.

ఈ సందర్భంలో కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలతో సమాలోచనలు సాగిస్తోంది. ఇప్పటికి పేపరు, కిరసనాయిలు, సిమెంటు, బొగ్గు మొదలైన సరకులపైన కంట్రోల్స్ తొలగించబడినాయి. ఇప్పటికింకా ఏటి ధరలు పెరగలేదు. పెరగవనే సూచనా కాబట్టి ముందుగా చీకటికొట్లలోకి పోకుండా ఈ సరుకుల్ని కాపాడినట్లే ప్రభుత్వం ధరల్ని అట్టే పెచ్చు పోకుండా అణిచిపెట్టడానికి వీలవుతుం

పంచదార ఎలాగూ దిగుమతి చేస తప్పదు. కేవలం మన ఫాక్టరీల్నే నమ్ముకుంటే మరోకసారి (కిందటేడులాగా) నమ్మకంచాటు లాభాలుగా అవపోయేమాట నిజం. కాబట్టి ప్రభుత్వం మాసంలో దిగుమతి చెయ్యదల్చుకు ప్రకటించిన పంచదారని దిగుమతి చే మన వర్తకుల్ని అదుపులో పెట్టడానికి పడుతుంది.

## కమ్యూనిస్టుపార్టీ పంథా

భారత కమ్యూనిస్టుపార్టీ పొలిట్‌బ్యూ బొంబాయిలో సమావేశమై, హింసాత్మకవిధ్వంసకచర్యలను త్యజించి "జాతీయ దాస్య విముక్తి," "వ్యావసాయిక సంస్కరణలే ప్రధానాంశాలుగా ఉద్యమం నడప ప్రకటించారు. ఇకనుంచి ఉద్యమాన్ని కమ్యూనిస్టు ఉద్యమపంథాలో నడపనున్నారు.

పంథా మార్పుతోపాటు నాయకత్వ కూడా మార్పు తెచ్చారు. బి. టి. ర స్థానే ఆంధ్ర కమ్యూనిస్టు నాయకుడు చంద్రరాజేశ్వరరావు పార్టీ ప్రధాన కార్యదర్శి అయినాడు. మార్క్సిస్టు—లెనినిస్టు—స్టాలినిస్టు గీతకి దగ్గిరగా ఎడమ

(36-వ పేజీ చూడుడు)



దక్షిణప్రాంత సర్వసేనాని మహారాజ్ శ్రీ రాజేంద్రసింగ్ జీ ఈవారం మద్రాసునగరం సందర్శించారు.

## అమెరికన్ జాతికి ఆదర్శ వీరుడు

# జనరల్ డగ్లస్ మెకార్థర్



[సూర్యనారాయణ]

యూరోపియన్ రాజరికాల బలవత్తర బంధాలనుంచి విడివడి, ప్రజాస్వామ్యం వాస్తవస్వరూపం ఫలానివిధంగా ఉంటుందని నిరూపించే వరకూ అమెరికన్ మిత్రమజాతికి వాషింగ్టన్, లింకన్, జెఫర్సన్, బెంజామిన్ ఫ్రాంక్లిన్ ఆదర్శ జాతీయపురుషులైనారు. ఈ నాయకుల ఆదర్శాల నీడను అమెరికన్ జాతీయ సంపద అపారంగా వృద్ధిచెంది, లోకంలోకెల్ల అద్వితీయమైన బలసంపదల్ని ఆర్జించుకుంది. యూరోపియన్ రాజకీయ ప్రాబల్యంకంటె అమెరికన్ ప్రాబల్యం అధికమవగానే, ఇరవయ్యో శతాబ్దంలో రెండు ప్రపంచయుద్ధాలలో యూరోపియన్ ప్రజాస్వామ్య రాజ్యాలకు అమెరికా అండగా నిలబడింది. ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఆర్థికంగానే గాక రాజకీయంగా ప్రపంచప్రాబల్యాన్ని ఆర్జించిపెట్టిన జాతీయనాయకులు విల్సన్, రూజ్వెల్టులు.

కాని అమెరికా రాజకీయబలం యూరోపియన్ రాజ్యాలలాగ సైనిక నౌకాబలాలపైన ఆధారపడలేదు. ఆర్థికబలంపైన ఆధారపడింది. కాబట్టి ఇరవయ్యో శతాబ్దంలో అమెరికన్ రాజకీయ ప్రాబల్యానికీ, అంతరంగిక రాజకీయాలకీ ఆర్థికబలం కలవారే ప్రాపైనారు. రెండో ప్రపంచయుద్ధంలో జపాన్ వంటి చిన్నదేశం వల్ల మొదట దెబ్బతిన్న అమెరికన్ జాతీయతకి ఆఘాతం తగిలింది. దానికి అమెరికా ప్రపంచంలోకెల్ల అద్వితీయమైన సైనికబలం కలదేశమని రుజువు చేసుకోవాలనే తాపత్రయం అధికమయింది. అయితే అమెరికా ఆయుధపరికరాల నిర్మాణంలోనూ ప్రయోగంలోనూ మాత్రమే ప్రాబల్యాన్ని ఆర్జించగలిగింది. నిలిచి దృఢమైన సమరంలో జయించడం అపురూపమైన జాతికి జపాన్‌పై ప్రతీకారం తీర్చుకోగలిగిన ఫలితాన్నిచ్చిన జనరల్ మెకార్థర్ ఆదర్శ వీరుడుగా కన్పించాడు.

ఈనాడు అమెరికన్ ప్రజానీకంలో జనరల్ మెకార్థర్, జనరల్ ఐసెన్‌హోవర్ జనరల్ మార్షల్ ప్రభృతులకుగల పలుకుబడి మరే నాయకునికీ లేదు. హాలీవుడ్ తారల పలుకుబడికూడా తలదన్నగలిగిన ఈ సైనికవీరుల పలుకుబడికి మరొక హేతువుకూడా ఉంది.

యూరోపియన్ రాజ్యాలు వలసల నార్జించి వాటిని నిలుపుకోడానికీ విస్తరింపచేసుకోడానికీ నిర్లజ్జగా కలహిస్తున్న సమయంలో, ప్రజాస్వామ్యసూత్రాలకోసం పోరాడి, వ్యక్తిస్వాతంత్ర్యం, వృత్తినిర్వహణస్వేచ్ఛ, వ్యాపారస్వేచ్ఛాసూత్రాలు ఆధారంగా అపారబలసంపదల నార్జించుకొన్న అమెరికా, ఈ ప్రజాస్వామ్యవిధానాన్ని అవలంబించే హక్కు ప్రతిదేశానికీ కలదని భావించింది. ఆరీతిగా ప్రజాస్వామ్యవిధానమే సర్వశ్రేష్ఠమైనదని స్వానుభవంతో నిరూపించి, అదే సర్వత్రా అనుసరించినట్లయితే యుద్ధాలు సంభవించవని, ప్రజలదుస్థితి నివారణకాగలదని, లోకమంతా కూడుగుడ్డలకు నివాసానికీ కరువులేకుండా జీవించవచ్చునని భావించింది. అన్యదేశాలలో ప్రజాస్వామ్యవిధానాన్ని నిరోధించినవారిని నిర్భయంగా విమర్శించింది. యూరోపియన్ రాజ్యాలకు కంటకింపుగా ఉన్నప్పటికీ నిస్సంకోచంగా తన భావాల్ని ప్రచారంచేసి, ఆసియా, ఆఫ్రికాలకుకూడా ఆశారేఖను చూపగలిగింది. కాని ఈ స్వేచ్ఛామంత్రం అధికమై అజీర్ణవ్యాధితో బాధపడుతున్న రోగివలె విపరీతసిద్ధాంతాల్లోకి దిగింది. ఆర్థికవ్యాపారాదిరంగాల్లో బలహీనమైన దేశాలుకూడా బలమైన దేశాలతో సమానంగా పోటీచెయ్యాలని పట్టుబట్టనారంభించింది. దీనికి జరిచే అన్యదేశాల ప్రభుత్వాలు స్వాతంత్ర్యసూత్రాలను విస్మరిస్తున్నట్లు భావించింది. అందువల్లనే అన్యదేశాలకు ప్రజాస్వామ్యసిద్ధాంతాలు అవగాహన కాలేదని, ఈ సిద్ధాంతాల్ని నేర్పవలసిన బాధ్యత తమపై కలదనీ, రోగికి హితవు లేకపోయినా ఔషధం బలవంతానైనా పట్టించి తీరాలన్నట్లు ప్రజాస్వామ్యసూత్రాల్ని బలవంతాన పట్టించే వైద్యులు తామేననీ భావించారు. ఆసియాదేశాల స్థితిగతులు, సహజసంపదపై ఆధారపడే ప్రజల సంఖ్య, నాస్థితి అమెరికన్లకు సరిగా అవగాహన కాలేదు. ప్రజల జీవనంలో పరిణతి తీసుకురావడానికి పార్లమెంటరీ రాజకీయాల యోగ్యత పరిమితమైనదనే విషయం వారికి బోధపడలేదు.

ప్రపంచంలో ప్రజాస్వామ్యానికి వేళ్లు పోయించడం విధిసంకల్పమని భావించిన అమెరికన్ జాతీయవీరుల్లో మెకార్థర్, ఐసెన్‌హోవర్ అగ్రగణ్యులు. ప్రభుత్వనాయకులకు ధనవంతుల్లో పలుకుబడి ఉంటే ప్రజల్లో పలుకుబడి తక్కువుంటుంది. ప్రజల్లో పలుకుబడివుంటే ధనవంతుల్లో పలుకుబడి తరిగిపోతుంది. ప్రెసిడెంట్ రూజ్వెల్ట్ ఆర్థికరంగంలో "న్యూడీల్" ప్రారంభించగానే ప్రజల్లో అతని పలుకుబడి ఎక్కువై, ధనవంతులు, ప్రభుత్వోద్యోగులు, రాజకీయ వాదుల విమర్శలకు గురైనాడు. ట్రూమన్ యూరోపియన్ రాజ్యపునరుద్ధరణకార్యక్రమాలలో ప్రజల్లో పలుకుబడి హెచ్చింది. కాని ఉభయత్రా పలుకుబడి సాధించినవారు ఈనాడు మెకార్థర్ ఐసెన్‌హోవర్లిద్దరే.

అమెరికాలో సైనికాధిపతులు సమర్థులనేకులున్నారు. కాని వీరికే అధికపరపతి

అంతా అడిగి రక్షణ పొందినవారే. కాని ఈరక్షణ ఇవ్వడంలో లోపం ఉన్నందువల్ల ఆపరిశ్రమలెన్నడూ విదేశాలలో రక్షణ పొందే పరిశ్రమల మాదిరిగా వృద్ధికానే లేదు. అంతేకాదు. అధికలాభాలు ఆర్జించే ఆశతో దేశంలో అవసరాల్ని కూడా గమనించకుండా వారు ధరల్ని పెంచేశారు. ఉత్పత్తిని తగ్గించేసి లేని గిరాకీ సృష్టించారు. రక్షణసుంకంమూలంగా పంచదారని దిగుమతి చేసుకున్నా ధర పెరిగిపోతుంది. దేశంలో కొరత తీర్చాలంటే దిగుమతిపైన సుంకాన్ని తగ్గించినట్లయితే ప్రజల బాధ తీరేదే. కాని తీరా క్యూబా పంచదార రావడం ఆరంభిస్తే మరీ అధికంగా వచ్చి మన పరిశ్రమపైన దెబ్బతీస్తుంది కాబట్టి అలా జరగలేదు. కాబట్టి దేశంలో వస్తువుల ధరల పెరుగుదల, ప్రజల సదుపాయంకూడా గమనించి దేశ ఆర్థికాభివృద్ధిలో ఆయాపరిశ్రమల ప్రాధాన్యతెంతో, వారి అవసరాలెంతో, వానిని బట్టి రక్షణసుంకాల్ని నిర్ణయించాలని ఇప్పటి ఫిస్కల్ కమిషన్ సూచించింది. ఇదివరలో ఏపరిశ్రమలవారు దరఖాస్తుపెడితే వారికి మాత్రమే ఈ రక్షణ ఇవ్వబడేది. ఇప్పుడలా కాకుండా శాశ్వతంగా ఒక టారిఫ్ కమిషన్ను నియమించి, స్వయంగా అన్ని పరిశ్రమలపరిస్థితుల్ని పరిశీలించి అవసరమైనవాటి కన్నిటికీ రక్షణ కాని ధనసహాయం కాని (సబ్సిడీ) ఇవ్వడం మంచిదని సూచించారు.

ఇతరదేశాల్లోమాదిరిగానే రక్షణ పొందిన ప్రతి పరిశ్రమ నిర్ణీతకాలంలో ఉత్పత్తి ప్రమాణంలోనూ, నాణ్యంలోనూ, అభివృద్ధి కనపరిచి దేశంలో అవసరాల్ని, ఎగుమతి అవసరాల్నీ తీర్చాలనే షరతు విధించడం న్యాయం. ఇదివరలో రక్షణ ఇచ్చి పరిశ్రమలపైన నిష్కర్షగా అటువంటి షరతులు విధించబడలేదు. అందువల్ల గిరాకీ ఉంటే కొద్ది పెట్టుబడిమీద అధికలాభం రావడం మంచిదనీ, పెద్దపెట్టుబడిమీదలాభం రేటు తక్కువరావడం అట్టేమంచిదికాదనీ భావించి దూరాలోచనలేకుండా పారిశ్రామికయజమానులు ప్రవర్తించడానికి వీలయింది. ఇంక అలా వీల్లేకుండా రక్షణపొందే ప్రతి పరిశ్రమకూ అభివృద్ధిపరచవలసిన బాధ్యత ఉండాలని కమిషన్ సూచించింది.

పన్నుల విధింపుద్వారా పరిశ్రమల అభివృద్ధిని ప్రభుత్వం కోరినమార్గాల్లో సాధించవచ్చును కాబట్టి, సమగ్రంగా అన్ని పరిశ్రమల్ని పెద్దవి, చిన్నవి, చేతివి అన్నిటినీ పరిశీలించి, ప్రజల అవసరాలు, ముడిపదార్థాల సప్లై, అభివృద్ధి అవకాశాలు, రవాణా సౌకర్యాలు, ఎగుమతివ్యాపారావకాశం గమనించి ఆ ప్రకారం ఒక ప్రణాళిక నిర్ణయించవచ్చునని చెప్పారు. ఆ ప్రకారం ఏ పరిశ్రమలపట్ల ప్రభుత్వం అధికశ్రద్ధ వహిం

(38-వ పేజీ చూడుడు)








# నేటి ప్రపంచం

## శాంతిసూచన వైఫల్యం *

ప్రపంచయుద్ధం సంభవించకుండా శాంతిని కాపాడ్డానికి భారత ప్రధాని పండిట్ నెహ్రూ చేసిన యత్నం విఫలమయింది. రష్యన్ అమెరికన్ ప్రభుత్వాల యుద్ధసన్నాహాల్ని గమనించినవారికి సన్నాహాలు కేవలం దేశరక్షణకోసమే కాదనీ, కాబట్టి యుద్ధనివారణకు ఎవరు ప్రయత్నించినా విఫలం కాక తప్పదనీ రూఢిగా తెలుసును.

చీనాకమ్యూనిస్టు ప్రభుత్వాన్ని భద్రతా మండలిలో ప్రవేశపెట్టి కొత్త భద్రతా మండలిలో తిరిగి కొరియా సమస్యను తెచ్చి దురాక్రమణను నిరోధించాలని పండిట్ నెహ్రూ రష్యన్ ప్రధాని స్టాలిన్‌కీ,



పండిట్ నెహ్రూ

అమెరికన్ విదేశాంగమంత్రి ఏచిసన్‌కీ, బ్రిటిష్ ప్రధాని అట్లీకి లేఖలు వ్రాశారు. పండిట్ నెహ్రూ లేఖ అందిన వెంటనే స్టాలిన్ జవాబిచ్చాడు. నెహ్రూ సూచనను మోదిస్తూ, కొత్త భద్రతామండలి ఉత్తర కొరియన్ ప్రతినిధివర్గాన్ని కూడా వినాలన్నాడు. కాని ఏచిసన్ అట్లీలు నెహ్రూ సూచనను నిరాకరించారు నిరాకరిస్తూ భద్రతామండలిలో చీనా కమ్యూనిస్టు ప్రభుత్వ సభ్యత్వ సమస్యకీ కొరియాయుద్ధసమస్యకీ ముడిపెట్టకూడదన్నారు.

బ్రిటన్ అమెరికాలుకూడా సూచన నంగీకరించిఉంటే కొత్త భద్రతామండలిని సమావేశపరిచి, కొరియాలో యుద్ధవిరమణ తీర్మానానికి ముందుగా సమ్మతించాలని



స్టాలిన్

రష్యాచీనాలను భారతప్రభుత్వం ఒత్తిడిచేసి ఉండేదనీ, అప్పుడే ప్రపంచానికి రష్యా చీనాల వైఖరి బోధపడి ఉండేదనీ భారత ప్రభుత్వం అభిప్రాయం. అదంతా భారత ప్రభుత్వం అనుకున్నట్లుగా జరిగిఉంటే, అంటే బ్రిటన్ అమెరికాలు నెహ్రూ సూచనను అంగీకరించి, తరువాత కొరియాలో యుద్ధవిరామానికి రష్యాచీనాలు సమ్మతించిఉంటే, ఏమి జరిగిఉండేది ? దక్షిణకొరియానుంచి ఉత్తర కొరియన్ కమ్యూనిస్టుసేనలు నిష్క్రమించవలసి వచ్చేది వెంటనే కొరియా అంతటినీ సమైక్యంచేసి ఏకప్రభుత్వాన్ని స్థాపించవలసిన అగత్యం కలిగేది. ఇదికూడా భద్రతామండలి పరిష్కరించవలసిన అగత్యం కలిగేది.

ఇదికూడా భద్రతామండలి పరిష్కరించవలసిన అగత్యం కలిగేది అంటే (ప్లెబిసైట్) జనవాక్యనిర్ధారణ ఐక్యరాజ్యసమితి అధ్వర్యంకింద జరపవలసి వచ్చేది. దురాక్రమణదోషం గురించి ఉత్తరకొరియన్ల వాదం వినకుండా కమ్యూనిస్టు సైన్యాల్ని తరలించడానికి రష్యా అంగీకరించడం సందేహం. అందు కొప్పుకున్నా జనవాక్య నిర్ధారణ జరపడం రష్యా అమెరికాలకు సమ్మతంకావడం అంతకంటె సందేహం. అందువల్లనే స్టాలిన్ ముందుకాళ్లకు బంధాలు వేశాడు. కొత్త భద్రతామండలి సమావేశమై కొరియాసమస్యను తిరిగి చర్చించడాని కొప్పుకుంటూ, ఉత్తరకొరియన్ ప్రభుత్వం వాదన వినాలని షరతు పెట్టాడు. ఇది అమెరికాకు ఇష్టంలేదు. కాబట్టే నెహ్రూశాంతిప్రతిపాదన విఫలంకావడానికి స్టాలిన్ ఏచిసన్ లిద్దరూ కారకులైనప్పటికీ, నిందమాత్రం ఏచిసన్ పైన పడింది.



ఏచిసన్

ఈ మెట్టుకి అమెరికా అంగీకరించిఉంటే రెండో మెట్టు త్రోసిపుచ్చిన నింద రష్యా పైన పడివుండేది. రెండో మెట్టుకి రష్యా అంగీకరిస్తుందని భావిస్తే. మూడో మెట్టుకి తరువాత ఈ అంకంపైన దక్షిణకొరియాలో తీవ్రఆందోళన ప్రారంభమయింది.

37-వ పేజీ చూడుడు)

# [illegible]



ఏడేళ్ళకే గోవిందం తనపొట్ట తాను పోసుకోవలసి వచ్చింది. ఎన్నాళ్లు తిరిగినా ఎక్కడా ఏపనీ దొరకలేదు. విసిగిపోయి ఒకరోజున ఒక కంసాలిదుకాణంలో అడుగుపెట్టాడు. అతికష్టం మీద అక్కడ వాడికొక పని కుదిరింది. అన్నంపెట్టి గుడ్డ

శ్రీ అమరేంద్ర

లిచ్చి బంగారంపని నేర్పేఒప్పందం పనిలో చొరవకలిగినాక జీతం బత్తెం ఏర్పాటు చేసే షరతు.

ఇల్లు అద్దంలాగా వూడ్చి, కుంపటిలో బొగ్గులువేసి గొట్టంతో అస్తమానం కణకణమండేట్లుగా వూదుతూవుండటం, దీపంలో చమురు పొయ్యటం, గ్లాసులు తుడవటం, యజమాని రంగాచారికి పొగాకు కాడలు తీసిచుట్టలు చుట్టివ్వటం, యజమానిపిల్లల్ని ఆడిసూవుండటం —ఈ పనులన్నిటితో క్షణం ఊపిరి పీల్చుకోటానికికూడా తీరేది కాదు. గోవిందానికి నా అన్నవాళ్లులేరు. రాత్రిపూట దుకాణం అరుగుమీదే పడుకునేవాడు.

ఈ చాకిరితో పదేళ్లు దొర్లిపోయినై.

ఈ పదేళ్లలో ఎన్నెన్నో మార్పులు వచ్చినప్పుడు రంగాచారి పెంకుటిల్లు ముందు డాబాగానూ తరవాత రెండంతస్తుల మేడగానూ మారింది. గోవిందం వుద్యోగం మటుకు గొత్తోక జెత్తెడుగానే వుండిపోయింది. మునపు ఏడాదికొక పాతలాగూ ముఖాన పారేస్తే ఇప్పుడు ఏడాదికొక కొత్తధోవతి ఇస్తున్నారు. మునుపు బీడీలకి రోజుకొకకాని ఇస్తే ఇప్పుడు అర్ధణా ఇస్తున్నారు. జీతం పెరగలేదు కాని పనిలోమటుకు బాని చెయ్యి తిరిగింది. కొత్త కొత్తమోస్తరు నగలగా సునాయాసంగా తయారు చెయ్యగలడు. అయినా గోవిందం జీవితంలో అసంతృప్తిఎరగడు. తనవాళ్లెవరూ లేకపోవడంచేత యజమాని ఇల్లే తన ఇల్లనుకొని సుఖంగాహాయిగా కాలక్షేపం చేస్తున్నాడు.

నల్లటి శరీరం, మోటుతేరిన కండలూ, వసారాక్రాపూ చూడగానే గోవిందం పల్లెటూరివాడని తెలిసిపోతుంది. ఈ పదేళ్ళలోనూ యజమాని ఏపనిచెప్పినా తననోటితో చెయ్యనని చెప్పిఎరగడు. పగలూ రాత్రీ క్షణమైనా విశ్రాంతి లేకుండా పనిమీదనే వుండేవాడు. యజమాని మాట గోవిందానికి వేదవాక్కు. ఎన్నడూ జవదాటలేదు.

రంగాచారి అరవయ్యోపడిలో పడినప్పటికీ ఆరితేరిన చెయ్యికనక అంతా అత నగలు చేయించుకోవాలని ఉవ్విళ తారు. కొంచెం వయసు వొంగినా దృష్టి తగ్గకపోవటంచేత కళ్లజోడు డానే శ్రద్ధగా పనిచేస్తూవుండేవాడు రకాల పంపిణీల గొలుసులు చెయ్యట రంగాచారిది అందివేసిన చెయ్యి. ఇంకా చాలామంది పనివాళ్లున్నా అ రంగాచారిమీదే గురి. అతని గి అంతులేదు. అతనితో పోల్చి నిల కంసాలి ఆప్రాంతంలో లేడు.

పెద్దవాడవటంచేత రంగాచారి రణంగా ఇల్లు కదలటంలేదు. బదులు కొడుకు రామాచారిని పం వుంచేవాడు. మునుపు అన్ని పనులూ చారి సొంతంగా చేసుకునేవాడు. కొ పెద్దవాడయినాక తండ్రిని కదలని. లేదు. తండ్రి పాతకాలపు మనిషికనక మాటలూనడవడీ చాదస్తంగా కనిపిస్తం అనుమానంతో రామాచారి పెద్దపె ఇళ్ళకి తనే వెళ్లి ఆర్డర్లు పుచ్చుకుని న్నాడు.

రామాచారికి కోపంవస్తే అగ్గిరా అతనంటే నౌకర్లందరికీ హడల్, ఏ పొరబాటు జరిగినా నౌకర్లని చడమడా జీతం విరక్కోసి హడావిడిచేసేవాడు. సుకి కుర్రవాడైనా ఇప్పుడు దుకాణ అతని చేతిమీదుగానే నడుస్తోంది

సంక్రాంతి పండగ సందడిలో గిరాకీ మరీ ఎక్కువైపోయింది. ఎ జీతంమీద అదనంగా నౌకర్లని వేసి తండ్రీకొడుకులకూ క్షణం తీరిక లేకుండా, పోరాలు మరిచి దుకాణంలో కూర్చు పని తెమలకుండా వుంది. పండగ స్తోంది. పనిమటుకు ఆవగింజలో అర మైనా కాలేదు.

తిండీ తిప్పలూ లేకుండా ము రోజులు ఒకే పనిమీద కూచొని రంగా నెక్లెస్ పూర్తిచేశాడు ఆ నెక్లెస్ ధనికకుటుంబం పురమాయించింది. తోనూ రత్నాలతోనూ పొదిగిన ఆ స్‌ని రంగాచారి ఒక్కచేతిమీద తర చేసి తన పనితనమంతా దాంట్లో పించాడు. తన మనసుకి నచ్చిన నగిషీ ఆ నగని అద్భుతంగా తయారుచేశాడు

అంత అశాంతి, అసంతృప్తి, ఆ సుఖజీవితం, ఆ దాసదాసీజనం, ఆవస్తువాహనాలూ. వాటి నక్కాలే, ఏదో తీరని లోటూ, హృదయంలో ఆరనిచిచ్చూ. ఇంతకీ, తనకీ, ఆ జీవితానికి ఏ మాత్రమూ సరిపడలేదు. తనకి ఇక జీవితం అనేదే లేదని తను జీవచ్ఛవం అని గ్రహించబోయేసరికి అనూరాధ ఒక్కసారి బావురుమంది.

ఆ నిస్తంద్రప్రకృతిలో, అర్ధరాత్రి వేళ, ఉన్నతసౌధాంతంలో, ఆ సౌధానికి గృహిణి యైన అనూరాధ బావురుమని ఏడ్చింది. ఆమె వెక్కి వెక్కి యేడుస్తోంది – ఆ దృశ్యం వర్ణించలేనిది. బోర్లా పండుకుని కన్నీటితో తలగడ దిండు పూర్తిగా తడిపింది. ఆమె హృదయ సముద్రంలో శోకతరంగాలు వెల్లువలై ప్రవహిస్తున్నాయ్. ఎందుకో! ఏమో ఎవరికి తెలుసు? ఆమెకే తెలియాలి.

అనూరాధ చాలా బీద కుటుంబంలో పుట్టింది. ఎలిమెంటరీస్కూలుమాస్టరుగిరీలో తండ్రి సంపాదించే సంపాదనమీదే, తనూ, తనకంటె పెద్దవాడైన రామంఅన్నయ్యా, తన చెల్లెలు వేణూ, నాన్నగారూ, అమ్మా మొత్తంకుటుంబం అంతా జీవించేవాళ్ళు. వచ్చే ఆదాయం కుటుంబపోషణకి చాలక నాన్న పడే ఆనాటిబాధలు తనకి ఇప్పటికి బాగా జ్ఞాపకం ఉన్నాయి. ఎన్నో బాధలు పడుతూనే ఒకపూట తిని ఒకపూట తినకుండా, గడుపుకుంటూ, అన్నయ్యకీ తనకీ చదువు చెప్పించాడు. తనూ, అన్నయ్యా స్కూలు ఫయినల్‌లో కొచ్చిన సంవత్సరం తన కుటుంబం పడ్డ బాధా అనుభవించిన దరిద్రం తను ఎన్ని యుగాలకైనా మరచిపోలేదు. ఒకవంక ఇద్దరికి జీతం కడుతూ, ఒకవంక కుటుంబాన్ని ఈడ్చుకురావలసిన పరిస్థితిలో, నాన్న చెయ్యి చాచకూడని ప్రతివాడి వద్దా కూడా, తమకోసం చెయ్యిచాచి, తమ చదువు చెప్పించాడు చదివి ప్యాసై, ఉద్యోగంచేసి అంత్యకాలంలో తన్ని కాపాడగలుగుతామన్న ఆశతో.

కాని తా నొకటి తలిస్తే దైవం ఒకటి తల్చింది. ఆ సంవత్సరమే అన్నయ్యా, తనూ, స్కూల్ ఫైనల్ ప్యాసయ్యారు. నాన్న ఆనందానికి పట్టపగ్గాలు లేకపోయాయి. ఆ నాటితో తన ఎన్నెన్నో బాధలన్నీ తొలగిపోయినట్లు ఆనందించాడు. అన్నయ్యకి ఉద్యోగం దొరికినట్లే మనస్సులో ఊహించుకొని, సంతోషించి, హృదయంలో భగవంతుడికి, భక్తిపురస్సరములయిన నమస్కారా లర్పించాడు. భగవంతుడంటే నాన్నకు ఎంతో నమ్మకం. కాని తను ఏభగవంతుణ్ణయితే పూర్తిగా నమ్మి ఆరాధించాడో, ఆ భగవంతుడే తన నాన్నకి ద్రోహం చేశాడు. అన్నయ్యమీదే తమ అందరిభవిష్యత్తూ పెట్టుకొని జీవించే, తమయావన్మందినీ ఒక్కసారి దుఃఖసముద్రంలో ముంచి అన్నయ్యను తమ అందరినుండీ, అనుకోకుండా వేరుచేశాడామాయభగవంతుడు.

అన్నయ్య పోయినప్పుడు గ్రామంఅంతా భయంకరమైన ఆకలరావల్ల సంక్షోభితం కావడం తమకుటుంబం ఒకమాసం రోజులు అన్నాహారాలు లేకుండా అలమటించడం ఆదుర్భర పరిస్థితి ఇప్పటికీ ఆమెకు కళ్లకు కట్టినట్టే వుంది. అదంతా జ్ఞాపకం వచ్చి మరోసారి బావురుమంది అనూరాధ.

అన్నయ్య పోడంతోటే నాన్న వెన్ను విరిగిపోయింది. మంచంపట్టాడు. చచ్చిపోతాడనుకున్నాంకూడా, కాని నాన్న చచ్చిపోలేదు. "నేను చచ్చిపోనమ్మా" నీకోసమైనా నేను బ్రతికేవుంటాను. భగవంతుడు మనల్ని పరీక్షిస్తున్నాడు. ఏనాడో ఎవళ్లనో ఇలాగే బాధలపాలు చేసిఉంటాను. ఆ ప్రతిఫలం ఇప్పుడు అనుభవిస్తున్నాను. మరేం భయం లేదు. తల్లీ, నిన్నే నా ఒకఅయ్యచేతుల్లో పెట్టి నువ్వు నీభర్తతో సుఖంగా జీవిస్తోంటే యీ పాపిష్ఠికళ్లతో చూసి అనంతరం ఈ ఇహలోకయాత్ర చాలిస్తాను. అదే నాకు కావలసింది" అనేవాడు నాన్న.

ఆమాటలు వింటుంటే తను దుఃఖంతో ఉక్కిరి బిక్కిరయేది. ఏమిటి నాన్నా! అలా అధైర్యపడతావ్. నీకేం భయం లేదు. నేనున్నాగా అనేది తను. ఆయేడే నాన్న సర్వీసుకూడా పోయింది. ప్రావిడెంటుఫండు కాబోలు ఎనిమిదివందలు వచ్చింది. అదితప్ప తమకుటుంబానికేమీ ఆధారం లేదు. నాన్న ఆడబ్బుతో తన పెళ్లి చేసెయ్యాలని అప్పుడే తొందరపడ్డాడు. కాని తనే ఒప్పుకోలేదు. అపరిచితుణ్ణి పెళ్లి అన్నా భర్త అన్నా, తనకి పరమఅసహ్యం కలిగింది. లోకజ్ఞానమైనా పూర్తిగా రాక ప్రపంచం అంటే ఏమిటో తెలియక హృదయం, శరీరంకూడా పూర్తిగా వికసించక పెళ్లిచేసుకోవడం ఒక కర్తవ్యం విధిగా పెళ్లిల్లు చేసుకుని ఎంతమంది సుఖపడగలుగుతున్నారు. పెళ్లి అయిన దగ్గర్నుంచీ అత్తగారి హయామూ భర్త అదుపాజ్ఞలూ సంఘం కుటుంబగౌరవం ఈ బాధలన్నింటివెనుకా తత్తుల్యమైనదే, శరీరార సుఖమూ, మానసికంగా బాధా అయిన భర్తతోడి సుఖం తత్ఫలితంగా కొన్నాళ్లకు పిల్లలూ, తరువాత ఆపిల్లలతోటి సంరక్షణ ఒక్కసారి మనోనేత్రంతో తనభవిష్యత్తును సింహావలోకనం చేసుకునేసరికి తనకి సంసారం భర్తా అంటే ఎంతో భయం కలిగింది. స్వేచ్ఛా, శాంతిలేని ఆజీవితంకంటె ఇలా నిరాడంబరంగానే కొన్నాళ్లు జీవించడం మంచిదనుకొంది. తను మొదట్నుంచి స్వతంత్రభావాలు కల యువతి. స్త్రీ అయినాసరే, ఇతరులమీద ఆధారపడకూడదని చదువుకుని ఏదో ఉద్యోగం చేసుకుంటూ స్వతంత్రంగా జీవించాలని తన అభిలాష. స్త్రీ ఒక పురుషునికి భార్యగా ఉండి అతని ఆగ్రహానుగ్రహాలపైనే ఆధారపడుతూ పిల్లల్ని కంటూ జీవించడానికే పుట్టలేదని స్త్రీకికూడా స్వతంత్రంగా జీవించాలనే, కోరికా ఎన్నో ఆశయాలూ ఉంటాయని ప్రస్తుతంలో తన పెళ్లికి ఏమీ తొందరపడవద్దనీ తనపెళ్లి చెయ్యాలనుకున్న డబ్బుతో రెండు సంవత్సరాలు కష్టపడి సెకండరీగ్రేడ్ ట్రయినింగు పూర్తిచేస్తే కుటుంబం [illegible] లోటు లేకుండా గడుస్తుందని నాన్నతో చెప్పింది. తనసలహా పాటించమని ప్రాధేయపడింది.

నాన్న తనమాట ఎన్నడూ కాదని ఎరగడు. ఆ వేళా కాదనలేదు. "ఆడపిల్లవైనా నువ్వే, మొగపిల్లాడివైనా నువ్వే. నువ్వుతప్ప నాకింక ఎవరున్నారు. నీ ఆనందమే నాకు కావలసింది. నీఇష్టప్రకారమే చెయ్యి" అన్నాడు నాన్న. తనూ సంతోషించింది. ఇహలోకంలోని కష్టసుఖాలన్నీ జీర్ణించి ఎంతో ఓర్పు ప్రదర్శితమయ్యే నాన్న కళ్లల్లో ఏవో ఆశాకిరణం కష్టకాలంలో వృద్ధాప్యంలో ఆదుకొంటాడని ఆశించిన చెట్టంత కొడుకు దక్కకపోగా ప్రాజ్ఞురాలైన కూతురువల్లనైనా ఆలోటు తీరగలదన్న ధీమా తృప్తీ, నాన్నముఖంలో ఆనాడు తనకు కనబడ్డాయి.

అమ్మకూడా, కాలూ చెయ్యీ ఆడనిస్థితిలో మాకింక దిక్కెవరు తల్లీ కొడుకయినా కూతురయినా నువ్వే. అలాగే చదువుకో అంది. అన్నికష్టాలు అనుభవించికూడా తనయందున్న ఆశా, ధైర్యం వల్లనే అమ్మ అలా జీవించి ఉండగలిగింది. లేకపోతే అన్నయ్య పోయిన మరుక్షణమే ఆమె హృదయం బ్రద్దలయేది.

ఏలాగయితేనేం, అనుకొన్నట్లుగానె ఎన్నో శ్రమల కోర్చి రెండేళ్లూ చదివి

ప్యాసైంది. తను ప్రావిడెంటుఫండు ఎనిమిది వందలూ గాక పైగా ఉన్న ఇంటిమీద నాలుగువందలు అప్పు పెరిగింది. తనకంటె చాలా చిన్నదయిన చెల్లెలు నాలుగవఫారంలో కొచ్చింది. ఆ సంవత్సరం ఉద్యోగంకోసం ప్రయత్నించింది కాని దొరకలేదు. చదువుకొనే రెండుసంవత్సరాలూ తనంటే ఎంతో ప్రేమాభిమానాలను చూపిస్తూ, గౌరవిస్తూ, తన ఆంతరంగికవిషయాలన్నీ స్వయంగా అడిగి తెలుసుకుంటూ తనకి ఎంతో ధైర్యం చెప్తూ తను పరీక్షలో నెగ్గడానికికూడా ఎంతో సహాయపడ్డాడు తెలుగు మేష్టారు మూర్తిగారు. ఆయన ఎప్పుడూ ఎంతో నిరాడంబరంగా ఉండేవాడు. అయినా ఆయనలో గొప్పవాళ్లకుండవలసిన లక్షణాలు ఎన్నో వున్నాయి. తనహృదయం తనకి తెలీకుండానే ఆయన్ని ప్రేమించేది. అనూరాధా! ట్రయినింగవగానే పెళ్లి చేసుకుంటావా? అని ఆయన అడుగుతోంటే తనకో కళ్లు మొగ్గ తొడిగేవి. దేవుడు నీకు ఏపతిని నిర్ణయిస్తాడో గాని అతనిజీవితం పుష్పితనందనవనం అవుతుంది అనేవారు. తనకెంతో సిగ్గుగాగర్వంగా ఉండేది ఆయన అలా అంటోంటే. ఎందుకో గాని ఆయనకి తనంటే అదొకవిధమైన అభిమానామూ ప్రేమానూ. పరీక్షలయి ఇంటికి వెళ్లబోయేముందు ఆయన అనూరాధా, మరచిపోకేం! నీపెళ్లికి శుభలేఖ వ్రాయకపోయినా వస్తాను. జ్ఞాపకం మాత్రం ఉంచుకో! అన్నారు పాపం. ఆయన ఎన్నిసార్లో డబ్బులేక ఇబ్బందిపడుతోంటే, పదీ, ఇరవై, ఇచ్చేరుకూడానూ. తనూ ఒక్కడే. బి.యిడి. ప్యాసైయ్యాడు. పాతికేళ్లు పైగానే ఉంటాయి. ఉద్యోగం చేసుకుంటూ చక్కగా సంపాదించుకుంటున్నాడు. కాని అప్పటికింకా ఆయన పెళ్లి చేసుకోలేదు. కారణం ఏమైఉంటుందో? తనుకూడా రెండు మూడు సార్లు అడగాలనుకుంది. నాలిక చివరదాకా వచ్చి సాహసించలేకపోయేది. ఆయనముఖం ఎప్పుడూ ప్రశాంతంగా, గంభీరంగా, నిశ్చలమైన మౌనముద్రతోనిండి ఎంతో తేజస్సమన్వితంగా ఉండేది. కాని ఆనిశ్చలంవెనుకనే గుప్తమై ఏదో కోరిక, నిస్పృహా, దాగివున్నట్లు అర్థమయేది తనకి మాత్రం. ఎన్నోసార్లు ప్రయత్నించికూడా, అడగలేకపోయింది. ఏ పుట్టలో ఏపాముందో ఎవరికి తెలుసు?

ఉన్నడబ్బంతా అయిపోయింది. ఆ సంవత్సరం ఉద్యోగమూ దొరకలేదు. ఎంత బీదతనంలో ఉన్నా, ఆ పల్లెటూళ్లో, అందరికన్నా తనకే ఎక్కువ గౌరవప్రపత్తులూ, ఆదరాభిమానాలూ ఉండేవి. పట్నంలో ఉండి అకస్మాత్తుగా పల్లెటూరు వచ్చిఉండటంవల్ల ఏమీ తోచేది కాదు. చదువుకుందామన్నా మంచిపుస్తకాలేమీ దొరికేవి గావు. ఏమీ పాలుపోకుండా ఉన్న ఆసమయంలోనే సమీపగ్రామంలో నుంచి ఎవరో దూరపుబంధువు, ఏదో స్వంత పనిమీద తమయింటికొచ్చారు. ఆయన పేరు పేర్రాజుగారని, సాలుకి పదివేల రూపాయల ఆదాయంగల శ్రీమంతుడనీ నాన్న చెప్పగా వింది. ఇంతకుముందెప్పుడూ ఆయన తమయింటికి రాలేదు సరికదా కనీసం తను ఆయన్ని చూసైనా లేదు. ఆయన ఆరోజు తమయింట్లోనే భోంచేసి పడుకున్నారు. పడుకొని లేచి, నాన్నతో చాలాసేపు ఏవేవో విషయాలు మాట్లాడి సాయంత్రమే వెళ్లిపోయారు. అమ్మ ఆమాటలన్నీ వింది. కాని తనకేమీ చెప్పలేదు.

రాత్రి అన్నాలయిన పడుకోబోయే ముందు నాన్న తన్ని పిల్చి దగ్గరకూర్చోబెట్టుకుని చెప్పాడు. చూడు తల్లీ, ఇప్పటివరకూ నువ్వూ, మేమూకూడా ఎన్నో కష్టాలు పడ్డాం. ఈనాటి పరమేశ్వరునికి మనపై అనుగ్రహం వచ్చింది అన్నాడు.

ఏమిటో అనుకుంది తను. ఏమీ అర్థం కాలేదు. ఏమిటి నాన్నా? అంది.

ఏమీ లేదు తల్లీ. నీ చదువుకోసం ఉన్నదంతా ఖర్చుచేశాం ప్రతిఫలంగా ఉద్యోగం అయినా దొరకలేదు. విధిలేక గాని, అయినా బ్రాహ్మణాళ్లం మనలో ఆడదానికి ఉద్యోగం ఏమిటి? ఈవేళ మన ఇంట్లో భోంచేసి వెళ్లాడు చూశావా, ఆయన మనవాడే; అతని తండ్రి నాకు బావగారవుతాడు. ఇన్నాళ్లనుంచీ, మనకీ, వారికీ రాకపోకలు లేవు. ఆయన మొదటిపెళ్లాం నిరుడే పోయింది. సాలీనా పదివేలు వస్తాయి జమీందారీ ఫాయిలాంటి సంసారం. మొదటి పెళ్లాం తాలూకు బోలెడు నగలున్నాయి. తనకు ఒక విధవాసోదరి తప్ప మరెవరూ లేరు. తల్లిమాత్రం వుంది. ఆవిడకూడా చాలా మంచిది. ఆయన నిన్ను చేసుకోవాలని ఎంతో కుతూహలపడుతున్నాడమ్మా! నువ్వెంతయినా అదృష్టవంతురాలివి. అదృష్టం నిన్ను వరించింది. మనకేనా ఏమీ ఆదాయంగాని, మడులు గాని మాన్యాలు గాని లేవుగదా? కట్నం లేకుండా పెళ్లి అవసమే దుర్ఘటంగా ఉన్న ఈరోజుల్లో దమ్మిడీ యివ్వలేని, మనబోటివాళ్లకు అటు

(33-వ పేజీ చూడుడు)

# బర్మాలో మన రైతులు

**శ్రీ జె. బి. శర్మ**

వ్యా దేశముఅభివృద్ధికి పరిశ్రమలకు వృద్ధి చేయుట అవసరము. పరిశ్రమాభివృద్ధికి మూలధనము అవసరము. మూలధనమును భూములనుండి మరలించుట అత్యవసరమని” బర్మా వ్యవసాయ మంత్రి ప్రకటించిరి. ఈ ఆశయమును సాధించుటకు బర్మాప్రభుత్వము భూములను జాతీయమొనర్చు చట్టమును చేసిరి.

ఇదే మంత్రి బర్మాపార్లమెంటులో లాండ్ రివిన్యూకు 12 రెట్లు పరిహారముక్రింద ఇచ్చెదమని ఒకానొక సందర్భములో చెప్పిరి. ఆయనలెక్క ననుసరించి పరిహారం ఈ విధంగా తేలుతుంది. ఒక అరకభూమి సగటున 350 తట్టల ధాన్యము పండుతుంది. ఇందులో వ్యవసాయమునకు 160 తట్టలు అవుతుంది. పోగా మిగిలిన 190 తట్టల ధాన్యము రైతుకు మిగులుతుంది. ఇందులో మళ్లా లాండ్ రివిన్యూ క్రింద 3 తట్టలు, ప్రభుత్వ ఋణము వడ్డీక్రింద 2 తట్టల ధాన్యము పోగా నికరముగ రైతుకు మిగిలేది 186 తట్టల ధాన్యము. ఇక్కడ గమనించవలసిన విషయము ఏమిటంటే మంత్రి లాండ్ రివిన్యూ క్రింద 3 తట్టల ధాన్యము నిర్ణయించిరి. వ్యవసాయముచేసే కామందుకు గరిష్టపరిహారము 12 రెట్లకు మించదు అంటే 36 తట్టల ధాన్యమునకు మించదు. దీనిని బట్టి బర్మా ప్రభుత్వము 350 తట్ట ధాన్యముపండి సంవత్సరమునకు 150 తట్టల ధాన్యము ఆదాయము వచ్చే భూమికి 36 తట్టల ధాన్యము పరిహారము ఇచ్చి భూమి తీసుకుంటూ గన్నమాట. సంవత్సరం రాబడిలో అయిధవవంతు కూడ లేదన్నమాట.

ఇక వ్యవసాయము చేయని భూకామందుల విషయము చూస్తే వారికి సంవత్సరాదాయములో సగముకూడ ముట్టుటలేదు. బర్మా రెవిన్యూ ఏక్టు క్రింద వ్యవసాయము చేయని భూకామందులు యకరమునకు 35 తట్టల ధాన్యము పండే భూమిలో 21% మాత్రము తీసుకొనే అర్హులు. అంటే 350 తట్టలలో భూకామందుకు 350 లో 21%=73½ తట్టల ధాన్యము వస్తుంది. 36 తట్టల ధాన్యము పరిహారము ఇస్తామనిరి.

పరిహార వ్యాయా వ్యయ విచారణ చేయుటకుముందు బర్మావ్యవసాయ పరిస్థితులు గురించి, బర్మాలోని భారతీయుల స్థితిగతులు, వ్యవసాయాభివృద్ధికి భారతీయు ఆర్థిక మద్దతుగురించి తెలుసుకొనుట అవసరం,

బర్మాబియ్యం ఎగుమతిచేయు దేశము ఎల్లా అయింది తెలుసుకొనుటకు ఎంతో వెనుకచరిత్రకు వెళ్లనవసరములేదు. 1850 లోనే కొంత ఎగుమతి పొడచూపింది, 1853 లో రెండవ బర్మా యుద్ధానంతరం దిగవ బర్మా, ఎగువ బర్మా ఇండియానుండి వచ్చిన వారు ప్రభుత్వము వారిచ్చిన సౌకర్యములవలన వ్యవసాయము ఎడల శ్రద్ధ వహించిరి. అప్పటిలో బర్మాబియ్యం యూరప్‌కి మాత్రమే వెళ్లేది. 1870 నుండి ఎగుమతులు విపరీతముగ పెరిగినవి. ఏగుమతులు పెరిగినకొద్దీ ధాన్యముపంట అభివృద్ధికి పెట్టుబడి అవసరమయ్యెను. మదరాసు చెట్టియార్లు పెట్టుబడి పెట్టుటకుముందుకు వచ్చిరి. నేడు బర్మాలో వరిపండే భూమి 5,755,000 యకరములు వుంది. ఇప్పుడు బర్మానుండి 1,110,000 ల టన్నుల బియ్యం ఎగుమతి అవుతున్నది. 1940 లో 12,188,220 యకరముల సాగు 3,276,193 టన్నుల ధాన్యము ఎగుమతి అయినవి. ఈవిధముగ నూరేళ్లలో తిండికే చాలకుండా పండించుకొనే దేశము 30 లక్షల టన్నులు ఎగుమతి చేసేస్థితికి వచ్చింది. ఇతర పంటలుకూడ ఇదే విధముగ అభివృద్ధిఅయినవి. 1921 లో బర్మా భూమిశిస్తువిధానకమిటీ నివేదికలో వ్యవసాయాభివృద్ధి గురించి ఇదేవిధముగ వ్రాసిరి.

బర్మాలో వ్యవసాయములో కల్గిన విపరీతాభివృద్ధికి భారతీయుల పెట్టుబడి చాల తోడ్పడెను. రిశ్రమాస్తులతో వచ్చి వారు భూమిని తీసుకొని కష్టించి పెట్టుబడిపెట్టి సాగుక్రిందికి తెచ్చిరని యఫ్, బి. పిచ్. ఐ సి. యస్ ‘బర్మా భవిష్యత్’ అనే గ్రంథములో వ్రాసియుండిరి.

మదరాసునుండి వచ్చిన చెట్టియార్లు డబ్బు పెట్టుబడిపెట్టిరి. చెట్టియార్లు సేవలను బర్మా గవర్నరు చేసిన సర్ హార్ కోర్టు బట్లర్ ఉపన్యసించుచూ బర్మాలో బ్యాంకింగ్‌కు చెట్టియార్లు వెన్నెముకయని ప్రశంసించిరి. బర్మా ప్రావిన్షియల్ బ్యాంకింగ్ విచారణ సంఘముకూడ చెట్టియార్ పెట్టుబడి అవసరము గురించి వ్రాసిరి. 1930 వరకు బర్మాలో అంతా శాంతముగ, సుఖముగ నడిచిపోయింది. బర్మాలో వర్గకులమత వివక్షత లేదు. కాని సామ్రాజ్యవాదులు ఇండియానుండి బర్మాను విడదీయుటకు విష ప్రచారము ప్రారంభించిరి. 1937 లో బర్మా ఇండియానుండి విడిపోయింది. జపాను బర్మాను జయించుట ఆఖరు ఘట్టము. దీనివల్ల ఇండియాస్నేహఅవసరము బర్మా వారికి తెలిసివచ్చింది.

తరువాత క్రమేపీ చెట్టియార్లు తప్పుకుంటూ వచ్చిరి. పెట్టుబడులు మాని భూస్వాములు అవుట ఇక్కడ ప్రారంభమైంది. 1930 లో 460 వేల యకరములు చెట్టియార్లక్రిందవుంటే 1938 లో 25 లక్షల యకరము లున్నవి. చెట్టియార్ల క్రింది క్రమేపీ పెరుగుతూ 1947 లో వ్యవసాయము చేయనివారి క్రింద యున్న భూమి 5,016,051 యకరములలో 2 416,628 యకరములు లేక 48% చెట్టియార్ల చేతుల్లో వున్నది.

దీనినిబట్టి బర్మా వ్యవసాయాభివృద్ధికి చెట్టియార్ల సహాయము ఎంతవరకు యున్నదీ తెలియగలదు. బర్మాలో మొత్తము 30 లక్షల యకరములు 25 లక్షలు చెట్టియార్ల క్రింద 5 లక్షలు ఇతరభారతీయులక్రింద యున్నది. రైతులక్రింద 60 లక్షలు, వ్యవసాయము చేయనివారిక్రింద మరో 30 లక్షల యకరములు వున్నది. దీనినిబట్టి బర్మావారిపై దోపిడీ జరుగుతున్నదనుటకు వీలులేదు.

బర్మాభారతీయులు భూములను జాతీయము చేయుటకు ఆక్షేపణ తెలుపుటలేదు. వారు కోరిన దల్లా న్యాయమైన పరిహార మివ్వవలయుననియే.

బర్మా వ్యవసాయమంత్రి "పెట్టుబడిదారీ విధానముకంటే జమీందారీవిధానము దుష్టమైనదనీ పెట్టుబడిదార్ల వలన కొత్త పరిశ్రమలన్నా ఏర్పడగలవనీ భూమిమీద పెట్టుబడుల వలన ప్రయోజనము ఏమీ లేదనిరి. దేశాభివృద్ధికి పరిశ్రమలు అవసరయనిరి." బర్మా విషయములో ఇది యథార్థము గాదు. బర్మాలో వ్యవసాయము ఒక పెద్ద పరిశ్రమగ అభివృద్ధి అయింది. భూస్వాముల పెట్టుబడులవలన అనేక లక్షల యకరములు సాగు క్రిందికి వచ్చెను. అనేకమందికి జీవనోపాధి ఏర్పడింది. ప్రజల జీవనప్రమాణము పెరిగెను ఇంతవరకు బర్మా వ్యవసాయాభివృద్ధికి తోడ్పడిన చెట్టియార్లు గురించి బర్మా వ్యవసాయపరిస్థితులు గురించి తెలుసుకున్నాము.

పరిశ్రమలను అభివృద్ధి చేయుటకు భూములను జాతీయ మొనర్చుటకు బర్మా ప్రభుత్వము నిశ్చయించినట్లు పైన తెల్పినాము.

బర్మా ప్రభుత్వము ఇవ్వదలచిన పరిహారము అతిస్వల్పము. చట్టము ననుసరించి ప్రతి భూస్వామికి లాండ్ రివిన్యూకు 72 రెట్లు పరిహారము ఇచ్చేందుకుకూడ వీలు లేదు. బర్మా యూనియను అధ్యక్షుడు సబ్ సెక్షన్ (3) ననుసరించి పరిహారమును నిర్ణయించి చెల్లించే విధానమును నిర్ణయించవలెనని చట్టములోని సెక్షన్ 7 (6) తెలుపుచున్నది. దీనినిబట్టి అధ్యక్షుడు నియమించే కమిషన్ పరిహారప్రాతిపదిక నిర్ణయించును కమీషన్‌కు సంపూర్ణాధికారములు ఇచ్చినందున వారేమి చేయగలరో తెల్పుట కష్టము. ఈ కమిషను వారి తీర్పుపై అప్పీలు లేదు.

1910 నుండి క్రమేపీ బర్మాలో భూమి విలువ పెరుగుతూ వచ్చింది. సగటున యకరము ధర రు 72 ల నుండి 1932 కు భూమి తరగతులను బట్టి 83 - 2/3 ల వరకు పెరిగింది

లోయరు బర్మాలోని మాబిన్ జిల్లాలో భూమి శిస్తు రు 5.86 లు వున్నవి. గరిష్ట పరిహారము 70 32 రూపాయలు అవుతుంది. యకరము ధర సెటిల్‌మెంటు రిపోర్టు ప్రకారము రు 500 లు.

అంహస్ట్ జిల్లాలో యకరం విలువ రు 300 ల వరకు వున్నది. ధరలు పడిపోయిన 1931-32 లో యకరం విలువ 2/3 లు వున్నది. భూమిజాతీయచట్టము క్రింద 10 నంబరు తరగతి భూమికి యకరమునకు రు 48 లు వస్తుంది. బర్మాలో భూములను 10 తరగతులుగ విభజించియున్నారు. దీనిని బట్టి బర్మా ప్రభుత్వము భారతీయభూస్వాములకు ఇవ్వదలచిన పరిహారము న్యాయమో అన్యాయమో తెలుస్తుంది.

బర్మా భారతీయులకు భూమి జాతీయమొనర్చే చట్టముక్రింద చెల్లించవలసిన పరిహారము విషయమై బర్మాప్రభుత్వముతో సంప్రదింపులు జరుపుటకు అయిదుగురు సభ్యులతో ఒక రాయబారవర్గమును పంపెను. రాయబారములో విదేశీ వ్యవహారశాఖకు చెందిన పాలౌడీ నవాబ్, మదరాసు మంత్రులు శ్రీయుతులు యం. భక్తవత్సలం, బెజవాడ గోపాలరెడ్డి బర్మా భారతీయ సంఘకార్యదర్శి, బర్మాలోని భారత రాయబారి రవూఫ్ సభ్యులు

వీరు బర్మాలో సంప్రదింపులు ముగించి స్వదేశము తిరిగివచ్చిరి. రాయబారవర్గము లో సభ్యులైన మదరాసు ప్రభుత్వ ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు కలకత్తాలో ప్రకటన చేయుచూ రాయబారవర్గము భారతీయ భూస్వాములకు చిరకాలముగ వుంటూ స్థిరవాసము ఏర్పరచుకున్నవారికి భూమి శిస్తు మీద 40 రెట్లు తొత్తగ నివాసము ఏర్పరచుకున్న వారికి 30 రెట్లు పరిహార మివ్వగోరితిమని చెప్పిరి. బర్మాప్రభుత్వము భారత రాయబారవర్గమువారి కోరికను పరిశీలించి భూస్వాములకు న్యాయమైన పరిహారము ఏర్పరచగలదని ఆశించవచ్చును.



ఢిల్లీకి 20 మైళ్ల దూరంలోవున్న కంజవాలా గ్రామంలో పారిశ్రామిక శాఖామంత్రి హరికృష్ణ మెహతాబ్ వృక్షస్థాపనోత్సవం జరిపారు.

కథానిక:

# "చెడావు మాన్యం"

వేసంకాలం - చైత్రం - వైశాఖం-జ్యేష్ఠం మూడు మాసాలు ఇంచుమించు గడ్డు రోజులు. శిస్తులు వసూళ్లు కావు. ఎక్కడ చూసినా బీటలు వేసివుంటాయి భూములన్నీ-

వైశాఖమాసం ప్రవేశించి 15 రోజులైంది. రాజుగారు రాజకీయాలు చూచుకుంటున్నారు.

"క్రిందటి సంవత్సరంకూడా మూడు తాలూకాల జమాబంది వుండిపోయింది. ఈ సంవత్సరం తప్పకుండా జరపాలి. లేకపోతే చాలా సొమ్ము 'తఖరరు'లో ఉండిపోతుంది." అన్నారు దివాంజీగారు.

"ఈసారి జమాబంది చాలా రోజులు అయేటట్టుంది. వేసంకాలం అంతా అక్కడే గడుస్తుంది కాబోలు" అన్నారు రాజాగారు.

"చిత్తము. వేసంకాలపు శోష పుట్టకుండా అన్నీ ఏర్పాటులు చేయిస్తాను. ఎప్పుడూ నీరుండే మన కేసరాపల్లి గ్రామంలో మకాము చెయ్యొచ్చు" అన్నారు దివాంజీ గారు.

"అన్ని సౌకర్యాలకీ అందుబాటులలో ఉంటుందా! ఆ గ్రామం."

"కొండలోనుంచి జలం పుట్టి ఏటిలోకి వస్తూ వుంటుంది. చెన్నంగి కొబ్బరినీరు లాగ ఉంటుంది రుచి. ఆ ఏటినీరు పురటాకులకు కూడా యిస్తూవుంటారు జిగురున చీదడం నే నిప్పటికి వినలేదు." అన్నారు దివాంజీగారు.

"నీటి సదుపాయం అమోఘం ఉన్న గ్రామంలో కూడా శిస్తుబాకీలు, నానా డిక్రీలు జరగడం ఎందుచేత?" అన్నారు రాజాగారు.

"ప్రతీపల్లెలోను పురాణపఠనం, భజన కోవెల ముఖ్యంగా ఉంటాయి. ఉ. చ. తప్పకుండా జరుగుతాయి. పురాణం అయిన తర్వాత ప్రతీఘట్టం విమర్శిస్తూ వుంటారు. రామరాజ్యంలో భూమాతకి లేదు లేదు. అసలు శిస్తే లేదు. పసుకిచ్చి సాకు పుచ్చు [illegible] నూరు మాసాలు యేమీ యివ్వనక్కరలేదు. యెదురులవారు చెప్పిన నీతికి మించిన నీతిలేదు. అట్టే బకాయిలు కూడా లేవు మన గ్రామంలో" కరణంగారు దస్తు శిస్తందారుడు చెప్పినారు.

"మర్మంలేని మాటుంటే అందరిని ఆకర్షిస్తుంది. ఆ కాలంలో రైతోడిమీదికి యిప్పటిలాగ ఇంతమంది ఉద్యోగస్తులెక్కడరా," అని అంటూ పోలయ్య, గవరయ్య, గంగనాయుడు విమర్శిస్తూ అంటారు.

"మేమంటే రైతాంగానికి చాలా భక్తని విన్నాము." అన్నారు రాజాగారు.

"రైతులకు తమకు మధ్య చాలామంది ఉద్యోగస్తులు వున్నారు. తమకు కబురు చేరేసరికి అనేకమార్పులు చెందుతుంది."

**శ్రీ నిడుదవోలు సూర్యనారాయణ**

"మేమే యీసారి జమాబంది స్వయంగా జరుపుతాము. ఏర్పాటులు చేయించండన్నారు రాజాగారు

"చిత్తం." అన్నారు దివాంజీగారు.

బయలుదేరేరు రాజాగారు-ఖాసానౌకర్లు తైనాతీ బంట్రోతులు, గుర్రపు సవారులు, లష్కర్ అంతా బయలుదేరింది.

రాజాగారు జమాబంది చేస్తున్నారని చూడ్డానికి, పిర్యాదులకి దరఖాస్తులు పట్టుకొని వచ్చారు.

అన్నీ పుచ్చుకొని సుమాస్తాగారు ఆఫీసు ముద్దరు వేస్తున్నారు.

ఒక మహజరు వచ్చింది-అందులో ఇలా ఉంది. చిట్టివలస గ్రామం సర్వే నెం 29/ఎఫ్ జిరాయితీ పల్లంకి వచ్చే గడ్డకాలువ మూడేళ్ళ క్రితం ఇటిక, సున్నంతో కట్టింగారు. ఆ సంవత్సరం వరదలికి కొట్టుకొని పోయింది. ఏలినవారికి ఒంటనే మహజరు పంపుకున్నాము. తరువాత ఇంజనీయరు గారికి పంపించుకున్నాము. తాణా అమీను గారు ఓవరుశీయరుగారు మా గ్రామం వచ్చి మూడురోజులు మకాముచేసి తణిఖీచేసి వెళ్లిపోయినారు. సముద్దారుగారు శిస్తు అడగడమే కాని యీ విషయం చెప్పితే రెండు డిపార్టుమెంట్లు పనికలిసి చెయ్యాలి, అనడం, పెద్ద ఉద్యోగస్తులు వస్తున్నారొస్తే వారి శరీరం కాపాడాలి మనం - అందుకు ఏర్పాటులకి కొంత సొమ్ము ఖర్చువుతుందని చెప్పి శిస్తు అడగడం. లేకపోతే సమ్మేరీ అండం.

"ఏ ఉద్యోగస్తులు వూరికొచ్చినా ఏర్పాటులన్నీ మేమే చేస్తున్నామండీ. కనికరం లేకపోయిందండి మహాప్రభూ!" అని ఒక పెద్దరైతు మొరపెట్టేడు.

రాజాగారికి తల తిరిగినట్లయింది.

"ఈ విషయాలు మా కెప్పుడూ తెలియజేయడం లేదేం దివాంజీగారూ?" అన్నారు రాజాగారు.

"నా కేమీ తెలియజేయలేదు. ఏమండీ - సూపరువైజరుగారు." వారు అమీనుగారిని, అమీను సముద్దారుగారిని పేదరాశిపెద్దమ్మ కథలాగ అడిగేరు.

ఇది వింటూన్న రాజాగారికి అయోమయంగా ఉంది. ఇవాళకి చాలించండి జమాబంది అంటూ లేచిపోయేరు.

జమాబంది జరుగుతోంది రాజాగారికి అన్ని విధాలా హైరాణా పడుతున్నారు. వేసంగి గాడ్పులు హెచ్చుగా వున్నాయి. రాత్రులు కూడా నిద్దుర పట్టడంలేదు. అందుచేత ఏటి యిసక తెప్పించి గుండ్రంగా అడుగెత్తున పోయించి దానిలో మంచం వేయించి పడుకున్నారు. తగ్గలేదు. ఒంటిమీద బట్ట వేసుకోడానికి కూడా చికాకుగా ఉంది - హాహాకారాలు ఎత్తిపోతున్నారు. 'పిలవండి వైద్యరత్నంగారిని' అని అన్నారు.

"వచ్చేరు - యీ ఎండవేడి తగ్గడానికి మందులేదా?"

"ఋతువు మారడమే మందు."

"సమయానికి లేని బాజా వంకనాకనా? మార్గం చూడండి" అన్నారు రాజుగారు.

లేహాలు, గుల్కందులు, అరుఖులు, వన మూలికలు, భస్మాలు, ప్రకృతిశాస్త్రం, పురజ్వాలు, అన్నీ అటుఇటూ తిరగవేశారు. ఆలోచిస్తూ ఉన్నారు.

"వుండడానికి వీలులేదు. యీ రాత్రి ఎంతసేపటికైనా జమాబందీపూర్తిచెయ్యండి. రేపు. ప్రయాణం సాగించాలి" అన్నారు రాజుగారు.

తెల్లవారింది. అంతా పూర్తి అయింది. దేవరాపల్లి చిట్టికొండ ఏటివాగుదగ్గిర అరటి తోట దేబల్లి సిరపడు అనేవాడు వేశినాడు. శిస్తు కట్టడం లేదన్నారు దివాంజీగారు.

"ఎన్నాళ్లనుంచి-ఎందుచేత"? అన్నారు రాజుగారు.

"మూడేళ్లు అయింది. ఇంతవరకు ఎందుకు వసూలు చెయ్యబడలే"దంటే ఆఫీసురికార్డు బట్టి చూస్తే మూడు మాసాలకి ఒక సముద్దారు, 5 మాసాలకి రాణా అమీను సర్వేయర్లు బదిలీ అవుతూ వచ్చేరు.

"కారణం?" అన్నారు రాజుగారు.

"అప్పటి సందర్భములబట్టి" అన్నారు దివాంజీగారు.

"మీ సంజాయిషీ నచ్చలేదు. స్వయంగా తోట చూస్తామన్నారు."

బయలుదేరేరు. పరివారంతో కొంతదూరం పల్లకీ సవారీ ఆపవలసి వచ్చింది. అన్నీ వంతర్లు, నడకదారి తప్ప వేరు మార్గంలేదు. రాజుగారు దిగేరు. వంతగ్గలోనుంచి నడుస్తున్నారు. కొంతసేపటికి పాదాలు వేడెక్కాయి - యిప్పమన్నారు జోళ్ళు - నడవడం మొదలెట్టేరు - కొంత నడిచేరు - వేడెక్కాయి పాదాలు మళ్ళా - కోపం వచ్చింది - 50 గజా లుంది. తోట-గెడ్డలో యిసుక చుర్రుమంటున్నాది. లక్ష్యం చెయ్యలేదు రాజుగారు. యింకా పదిహేను గజా లుంది - తోట - ఇదంతా చూస్తున్న చర్మాల చేతగాడు. పొలంలోవున్న అరటి చెట్టు కొట్టి దవ్వతీసి - మిగిలిన దొప్పతోటి ఒక చెప్పులజత కుట్టకుండా తయారుచేసి ఏలిన వారి పాదాలముందు పెట్టేడు - తొడిగేరు రాజుగారి కాళ్లకి. వేడెక్కిన పాదాలకు చల్లగా అరటిదొప్ప తగలడంచేత నిలుచున్న పాటున నిద్రవచ్చింది రాజుగారికి - తెలివొచ్చింది. గాభరా తగ్గింది - ఖులాసాగా ఉన్నారు.

శిస్తుకట్టని శిరపయ్యని హాజరు పెట్టేరు.

"ఎందుకు శిస్తు కట్టడం లేదు." అని ప్రశ్నించేరు.

"చిత్తం ప్రభూ, ముందరన భూమికోసం దరఖాస్తు చేసానండి. రాణా సర్వేయరుగారు భూమి కొలత చేసి రికార్డు తయారు చేస్తానని రు 25 లు పుచ్చుకున్నారండి. అయాల గొలుసుకూడా నేనే లాగేనండి. తరోత సముద్దారుగారు య 1-కే రు 12 చొప్పున 10 ఏళ్ల శిస్తు నజరానా యియ్యాలన్నారండి. పట్టా వచ్చేవరకు అటూ ఇటూ ఖర్చు లవుతాయని రు 300 లు పుచ్చుకున్నారండి. ఈలోపున దస్తుకు హాస్కరణంగారొచ్చి, పట్టా రాయాలని ముద్ర ఏయించి రు 20 లు పుచ్చుకున్నారండి - మొన్న క్రొత్త సముద్దారొచ్చి మళ్లీ శిస్తు కట్టమన్నారండి. సర్వేయరుగారు మరి రాలేదండి - రాణా దారుడు ఇదిగో పట్టానకలు రాయిస్తానని చెప్పి రు 10 లు పట్టికెళ్లినాడండి" అని ముగించాడు.

"ఇకనుంచి రాజకీయాలు మేమే స్వయంగా చూచుకుంటాము." అని చెప్పి వెంటనే రైతుకు పట్టా యిప్పించి అరటి చెప్పుల జత చేసిఇచ్చిన చర్మాల చేతగాడికి వాని పని మెచ్చుకుంటూ ఒక మాన్యం ఇచ్చి దానికి చడావు మాన్యం అని పేరు పెట్టేరు. ఇప్పటికి దాన్ని అలాగే పిలుస్తున్నారు.

---



8 వ అఖిలభారత సోషలిస్టుపార్టీ వార్షికసమావేశం. సభాధ్యక్షులు అశోక మెహతా ప్రసంగం. శ్రీ జయప్రకాశ్ నారాయణ్ పక్కన కూర్చున్నవారు బర్మాప్రతినిధులు.

## మాటా - మంతి:

# రాజకీయం

స్థం :

పెద్దమనిషి మిద్దెక్కి చుట్టూ కొన్ని ఒకసారి అవలోకించి మూర్ఛ పోట. ఆయనెందుకు మూర్ఛపోయాడో, లోకాన్ని గురించి ఏమనుకుని పోయాడో తెలియదు. ఆయన్ని లేవ దియ్యడానికి వచ్చినవాళ్లు మిద్దె మీదెక్కి చుట్టూ చూశారు. ఏ పులైనా కనపడిందో, లేక దెయ్యం భూతం కనపడ్డాయోనని. ఏమీ కనిపించలేదు. పువ్వుల మొక్కలతోట, పెద్ద పెద్ద చెట్లూ, అంతదూరంలో తోపులూ మాత్రం కనిపించాయి. ఇవి చూస్తే మూర్ఛ వస్తుందా ?

బహుశా ఇంత వైశాల్యంలో ఒంటరితనం వల్ల గుండె దడపుట్టి మూర్ఛపోయాడనుకున్నారు కొందరు. కాదు ప్రకృతి సౌందర్యం చూసి తన్మయుడైపోయాడన్నారు కొందరు. ఈ రెండు హేతువుల్లో ఏది నిజమైనా అంతమాత్రానికి మూర్ఛపోతాడా? అది ఆమనిషి మనస్సుని బట్టి ఉంటుంది. గోరంతల్ని కొండంతచేసి పరితపించేవారు ఏ కాలంలోనూ ఉంటారు.

మన కాంగ్రెస్ పరిస్థితి ఈనాడు ఇలానే ఉంది. రాబోయే ఎన్నికల్లో కాంగ్రెస్‌కి సంపూర్ణవిజయం తప్పదని ...న్నెళ్ల క్రిందట కళా వెంకట్రావుగారన్నారు. ఈనాటికి కాంగ్రెస్ రచ్చకీడవబడిందని మళ్లీ మొన్న కలకత్తాలో అన్నారు. కాంగ్రెస్ ప్రజల్లో పాకిపోతున్నందుకు సంతోషించాలో, రచ్చకెక్కినందుకు విచారించాలో తెలియడంలేదు.

ఎవరు పెద్ద ?

కాంగ్రెస్ రోజురోజుకీ ఉబ్బి పెద్దదైపోతున్నమాట నిజమే. పూర్వపు వలా సభ్యుల సంఖ్య మీద కేవలనికానీసభ్యుల సంఖ్య కొన్ని ...యింది. మెడమీద తలున్న ...రందుకు ఫలితం ...సమందు కుటుంబ కలహాలూ, వంశవైరాలూ, పంచాయతీ... పోట్లాటలూ, వర్తకపోటీల సంతా అంతా ఏకమై కాంగ్రెస్‌వాహినిలో కలిసిపోయింది.

ఇదివరకు ఒక దిక్కుకే నడుస్తున్న బండి మీద అందరూ ఎక్కి, బండిని నిలబెట్టి, మా వూరు వెళ్లాలంటే మావూరు వెళ్లాలని కొట్లాడుకుంటున్నారు. ఈసందడిలో దొరికిన మటుకు కృష్ణార్పణం అన్నట్లు, కాంగ్రెస్ పేరుచెప్పి వ్యాపారులు జేబులు నింపుకుంటున్నారు. బండిమాత్రం కదల్లా. తీరా వచ్చి ఊబిలో దిగబడింది. దిగి ...గేవాళ్లు లేరు కాని జనం ఇంకా ఇంకా ఎక్కి ఇంకా ఊబిలోకి దింపేస్తున్నారు. అన్ని ఊళ్లజనం తమపార్టీలోనే ఉన్నారు కాబట్టి బండి ఎవరు నడపాలో నిర్ణయించడానికి ముందుజరగబోయే ఎన్నికల్లో

[ఎస్సార్]

సారథ్యం తమకే లభిస్తుందని వెంకట్రావుగారన్నారు. తమకేఅన్నారే కాని అతినెవరో అంతమందిలో ఎవరుపెద్దో ఎవరుచిన్నో నిర్ణయించడానికి తగవులొచ్చి కొట్లాడుకుంటూ రచ్చకెక్కేసరికి వెంకట్రావుగారికి దుఃఖం పొంగివచ్చి, నిలబడే రెండుగంటల సేపు కలకత్తా కోర్టులో సాక్ష్యం ఉపన్యసించారు.

ఎన్నికల్లో కాంగ్రెస్‌కి సంపూర్ణవిజయంమాట అటుంచితే, ముందుగా కాంగ్రెస్ పరపతిమాత్రం పూర్ణానుస్వారమయింది. పోయిన పరపతిపోనే పోయిందికాని, ముందు ఎన్నికల్లో కాంగ్రెస్‌కి లభించబోయే ఆ పూర్ణం ఆ కాంగ్రెస్‌లో ఎవరికి దక్కాలో నిర్ణయించడానికి, ఈ కాంగ్రెస్ పంచాయితీ ఎన్నికలు జరిగాయి. ఇది మరోదేశంలో అయితే అరుపులూ కేకలూ ఎంతపైకి వినిపించినా, ముసుగులో గుద్దులాటగా ఉండిపోయేదే. కాని కాంగ్రెస్ ముసుగ్గుద్దు... ప్రజాస్వామ్యరాజకీయ పక్షమని రుజువుచేసుకోడానికిగాను ముసుగు తీసిపారేశారు.

రచ్చబండ :

వీధిలో పడితన్నుకున్నా ఇబ్బంది లేదు కాని కోర్టుకెక్కడంతో పరువుపోయిందంటారు వెంకట్రావుగారు. వీలుచిక్కితే ప్రకాశంగారు ఇదివరకే సుప్రీం కోర్టుకెక్కేవారే-ఇప్పటికప్పుడు పాపం పటేల్ నెహ్రూల సలహామాటలువిని వెనక్కితగ్గుతున్నారన్నమాట. కానినిజానికి రచ్చకెక్కడం ఇది మొదలు కాదు, కాంగ్రెస్ పేరు చెప్పి రచ్చకెక్కడంమాత్రమే ఇదిమొదలు. ఆ ప్రతిష్ఠ కాస్తా ప్రకాశంగారికి దక్కకుండా బెంగాల్ కాంగ్రెస్‌వారు తన్నుకుపోయారు.

కర్రమతం :

కాంగ్రెస్ పేరు చెప్పకుండా కోర్టుల కెక్కడమే కాదు, నువ్వు కమ్యూనిస్టంటే నువ్వు పరమకమ్యూనిస్టని తిట్టుకుని, కొట్టుకుని, కొట్టించి జైళ్ళలో పడ్డారు.

సామదానభేద దండోపాయాల్లో చివరి ఉపాయాన్ని ప్రయోగించవలసివచ్చినప్పుడు మన ఊళ్లల్లో మాగాలు పద్ధతొకటుంది. మాపల్లెల్లో మాలోళ్లకీ, దొమ్మరోళ్లకీ ఇంత అమృతం పోయించి, కావలసిన వాళ్ల పేరు చెప్పి, పూజచేయించడం. ఒకడిభాగ్యం మరీ పెరిగిపోయి వాడింక విరగడైపోవాలని మనసారా కోరేవాడు అభాగ్యవంతుడింటికి రాత్రివేళ కన్నంవేసేవాళ్లని పంపేవాళ్లు. ఊళ్లో కరణం మునసబు తగవులాడి వాళ్ళూళ్లని తెస్తేవీళ్లు మాదేవుళ్ని తీసుకొచ్చి వారు ఆరెండు గుంపులూ కొట్లాడుకుంటుంటే కోడిపందాలు చూసినట్లు నామాదకుండా కరణం మునసబు లిద్దరూ ఇళ్లలో ది తలుపులేసుకుని మననం చేసేవారు. కాంగ్రెసువాళ్లూ కమ్యూనిస్టులూ ప్రజల్లోకి పాకిపోయి సరిగ్గా ఈ పద్ధతే నవలంబించారు. తన్నడం తన్నించుకోవడం వృత్తిగా పెట్టుకున్న వాళ్లకి మంచి గిరాకీ తగిలింది.

కాంగ్రెస్‌వాళ్లు కమ్యూనిస్టుల్ని, కమ్యూనిస్టులు కాంగ్రెసువాళ్లనీ, కాంగ్రెస్‌వాళ్లు కాంగ్రెసు వాళ్లనీ తన్నించడం ఎక్కువయ్యేసరికి కర్రవృత్తివాళ్ల కర్రల ధరలు పెరిగిపోయాయి. ఎముకలు విరగ్గొట్టే కర్రకంటె బుర్ర చితకపొడిచే కర్ర ధర అధికం. దానికంటె కత్తి ధర అధికం. తుపాకీధర మరీ ఎక్కువ. ఇంత పెట్టుబడి పెట్టడానికి డబ్బు చాలక ఇనప్పెట్టెలు బద్దలుకొవడం, బంగారు గొలుసులు తెగడంకూడా అవసరమయింది.

పంచరంగులు :

ఈవృత్తి కింత గిరాకీ తగిలేసరికి కాంగ్రెస్ మోతుబర్లు కొత్తపద్ధతులు కనిపెట్టారు. ఉద్యోగం వృత్తీలేక ఖద్దరు కట్టుకు తిరిగే వాళ్లెక్కువమంది కనిపించారు. వాళ్లని చేర్చి ఎవరి బలగాన్ని వాళ్లు బలపరుచుకుని కర్ర ట్రెయినింగ్ ఇప్పించి పోషించడం ఆరంభించారు. సర్వసభ్య సమావేశాల్లో, రాజకీయసమావేశాల్లో, జిల్లాసమావేశాల్లో, ఉద్యమాల్లో, సంతర్పణల్లో, వడ్డనలకూడా వీళ్లు బాగా పనికొచ్చారు. అధికారంలో ఉన్నవారి ముఠావాళ్లు తెల్లఖద్దరు, పైజామా, బడితె ఉపయోగిస్తారు (నాలుగ్గజాలపన్నా యేనా సరే పైజామాలే తొడగాలి). వీళ్లు చేతిలో బడితల్తోసహా లారీల్లో తిరుగుతూ మంత్రులు, వారికింది ఛోటాలు ఉపన్యసించే సభల్లో కాపువేస్తారు. ఇంకో ముఠా మొగాళ్లు ఆకుపచ్చ ఖద్దరు నిక్కర్లు, ఆడవాళ్లయితే ఎర్రఖద్దరు బిగుతుపొడుగు లాగులు, బిగుతుపొడుగుచేతుల చొక్కాలూ తొడిగి "మారుజై మారుజై" అంటూ అరుస్తూ తిరుగుతారు. ఈ ముఠాలవాళ్లంతా అమృతం అక్కర్లేకుండానే ఊళ్లకి గుంపులు గుంపులుగా ఎగబడతారు. "కమ్యూనిస్టుల్ని చంపుతాం, పొడుస్తాం" అంటూ రెండు ముఠాలవాళ్లు ఊళ్లమీద కెళ్లి తెల్ల ఖద్దరు వాళ్లు కనబడితే ఎర్ర పచ్చ ఖద్దరువాళ్లు, వీళ్లు కనపడితేవాళ్లు కలబడతారు. కర్రలకి బుర్రలు బద్దలౌతాయి.

వర్గచైతన్యం :

కమ్యూనిస్టులయితే అల్లా కాదు. పీడిత కూలీ వర్గంలో "వర్గచైతన్యం" (క్లాస్ కాన్షస్‌నెస్) కలిగించి, పార్టీ యోధుల్ని (మిలిటెంట్ వర్కర్స్) తయారుచేస్తారు. వర్గచైతన్యం ఒక పట్టాని పుట్టదు. ఆ పీడిత జనులికి ఇంత అమృతం (పీపుల్స్ ఫ్రంట్ ప్రచారం) పోసి, పార్టీ కైపెక్కించాలి. పెట్టుబడిరాక్షసుల్ని కాపాడ్డానికి ఖాకీ దుస్తులవాళ్లే పోలీసులు కారనీ, ప్రజాశాంతిని కాపాడ్డానికీ పీడిత ప్రజల్ని పోషించడానికీ మీరూ పోలీసులతో సమానమేననీ చెప్పి, వాళ్ళచేత ఖాకీదుస్తులుతొడిగించి, కర్రలు, కత్తులు, తుపాకులిస్తారు. ఫలాని షావుకారు ఇనప్పెట్టెలో డబ్బు షావుకారుది కాదనీ, అది ప్రజలదేననీ, ఫలాని కాంగ్రెస్ వాణ్ణి ఎముకలు విరగ్గొట్టడం ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదాన్నీ, బూర్జువా ప్రభుత్వాన్నీ, ఎముకలు విరగ్గొట్టినట్టేననీ చెప్తారు. దీంతో పార్టీకీ, పార్టీ యోధులికీ, పీపుల్స్ ఫ్రంట్‌యోధులికీకూడా పుణ్యమూ పురుషార్థమూకూడా దక్కుతాయి.

అంతా ఒకటే :

ఇక్కడో పెద్ద చిక్కొచ్చి పడింది. ఆమధ్య ఒకఊరిమీద ఒకఖాకీ దళం వచ్చి పడింది. వచ్చినదళం పోలీసులైనదీ తెలియదు, కమ్యూనిస్టులైనదీ తెలియదు. ఊరికే కాకీదుస్తులు వేసుకొచ్చిన దోపిడి దొంగలైనదీ తెలియదు. గ్రామరక్షకదళంవాళ్లు పోలీసులనుకుని కర్రతుపాకీ ఎత్తనవసరం లేదనుకున్నారు. ఆగుంపు వచ్చి ఈ రక్షకదళంవాళ్ళని మీరు కమ్యూనిస్టులంటూ తన్ని ఊరుమీదపడి దోచుకున్నారు.

పోనీ తన్నేపద్ధతి, దబాయించే పద్ధతి, ఇళ్లమీదపడే పద్ధతుల్లో ఏమైనా తేడా ఉంటే ఫలానివాళ్లనుకోవచ్చును. ఏమీ తేడాలేకుండా పోయిందిట. పోలీసులొచ్చినా, కమ్యూనిస్టులొచ్చినా, కమ్యూనిస్టుల్ని వెతికి పట్టుకుని తన్నేవంకతో తెల్ల ఖద్దరువాళ్ళొచ్చినా, పచ్చ, ఎర్రఖద్దరు వాళ్ళొచ్చినా అంతా ఒకటే పద్ధతిట. ముందు గ్రామరక్షకదళంవాళ్లని దబాయించడం. వాళ్ల దగ్గర కర్రలు కత్తులు, తుపాకులు కర్రతుపాకులు లాక్కోవడం, ఫలాని కమ్యూనిస్టు ఎక్కడున్నాడంటూ ఇళ్ళు చొరబడ్డం, సోదా చేస్తున్నట్లు వస్తువులన్నీ కిందమీదు చేసి విలువైనవాటిని తస్కరించడం "మీపని పడతాం చూడండి. వారంరోజుల్లోగా ఆకమ్యూనిస్టుని ఇస్తారా లేదా మళ్లీ వస్తాం" అని బెదిరించి వెళ్లిపోవడం.

వీరిలో కొందరు పగలొస్తారు. కొందరు రాత్రివస్తారు. పగలు వచ్చినవారి హడావిడి అధికం. రాత్రివచ్చినవారు సైన్యం ఆక్రమించినట్లుగా అర్డర్లిస్తారు. పట్టపగలొచ్చిన వాళ్లకి ఇళ్ళు సోదాలు చెయ్యడానికి, ఆడవాళ్లని కూడా చెయ్యిచేసుకోడానికీ అధికారం ఉందన్నట్లు ప్రవర్తిస్తారు. అవూళ్ళో కమ్యూనిస్టులున్నారనే పుకారు ఉండి, వచ్చినవాళ్ళు నిజంగా పోలీసులే అయితే గొడవ మరీ ఎక్కువ. కనుచీకట్లో కాని, పట్టపగలు వెలుగులో కాని కనిపించిన చెట్టూపుట్టాచూసికూడా కమ్యూనిస్టని భయపడతారు. అవు కనిపించేసరికి అది ఫలానిదని నిర్ధారణ చేసుకోడానిక్కూడా భయపడి, ముందే చావగొట్టేసి తరవాత చూద్దాం అనుకున్నారు. పోలీసులు. కమ్యూనిస్టులు దొరక్కపోగా, నోరులేని గోమాత పోలీసుల పాలబడి చావుదెబ్బలు తిని చచ్చిపోయింది.

గ్రామరక్షకులు ఇరకాటంలో పడ్డారు. వాళ్లచేతికి తుపాకులిస్తేవచ్చినవాళ్లు లాక్కుపోతున్నారు. వీళ్లే ఉపయోగించబోతే ఆ మధ్య తుపాకీకూడా కుట్రపన్నింది. గుండు నేలకి తగిలి ఎగిరి మరో గ్రామరక్షకుణ్ణే పొట్టపెట్టుకుంది.

ఫలితం ఏమిటంటే పోలీసులెవరో, కమ్యూనిస్టులెవరో, కాంగ్రెస్‌కర్రలవాళ్లెవరో తేడా తెలియకుండా పోయింది. గ్రామరక్షకులు గ్రామాన్ని రక్షించడం మినహా, మిగత అల్లరంతా చేస్తున్నారు.

కాంగ్రెస్‌కి విజయం సంపూర్ణంగా సిద్ధిస్తుందని వెంకట్రావుగారు ఉబ్బితబ్బిబ్బైనారంటే తప్పులేదు. రచ్చకెక్కినా పరవాలేదనుకుంటే చాలు. ప్రజల్లో ఎంతరాజకీయ చైతన్యం వరదలై పారిందో, దళాలూ ముఠాల పరుగుల్ని బట్టి కొల్చిచూస్తే, తప్పకుండా ఆనందంలో బుడుంగున మునిగిపోవచ్చు. మరి భారతదేశం, ఆసియా మేలుకుంటున్నాయి కదూ.

---

అంటే ఎరుగనివారు గలరు హరికథలు, పాట కచ్చేరి, నృత్యము, మొదలగు లలితకళలు వీరి నాకర్షించలేవు. రైళ్లు, బస్సులు ఎక్కని ప్రజలుగూడా అనేకులు గలరు. అధునాతన నాగరికత వీరిలో ఒక రకమైన ఏహ్య భావమును పుట్టించును. నాగరికత గలిగిన స్త్రీ పురుషులను చూచి వీరు అసహ్యించుకొందురు. ఆధునిక వైజ్ఞానికాభివృద్ధికి చాలా దూరముగా నున్నందున వీరిలో బహు పురాతనవిధానములే బాగా పాతుకపోయినవి

### భాష - సంస్కృతి

వీరి వేషభాషలు బహు సనాతనత్వాన్ని రుజువు చేయును. ఓఢ్రశబ్దములుకూడా వీరి భాషలో పొడచూపును యీ జిల్లావాసుల ఆచారములలో చాలా భాగము ఓఢ్ర సాంప్రదాయమును పోలియుండును. ఒకప్పుడు యీ జిల్లాలో చాలాభాగము ఓఢ్రుల పాలనక్రింద యున్నట్లు కనబడుచున్నది గ్రామకరణాలు యిప్పటికికూడా పట్నాయికులే యున్నారు. వీరు ఓఢ్రులు. వీరు మాతృ భాషను మరచిపోయిరి. యిచ్చట నివసించే అవర్ణులలో అన్ని తెగలవారుగూడా ఓఢ్రదేశమువే. వీరికి మాతృభాషలో ప్రవేశమున్నది కట్టు ఆచారములుగూడా ఓఢ్రుల ననుసరించియే యుండును గ్రామదేవతల పండుగలు, బలులు మొదలగునవి మిశ్రమ సంస్కృతినే స్ఫురింపజేయును అచ్చు తెలుగు చాలా తక్కువ విద్యాసౌకర్యాలు లేకందున ఆధునికసాహిత్యము వీరిలో ప్రవేశ బడలేదు. నాగరికత విజ్ఞానములు తక్కువగా యున్నవి.

### రాకపోకలసౌకర్యాలు

ఇంత విశాలమైన జిల్లాలో రహదారి సౌకర్యాలు బొత్తిగాతక్కువ యిప్పుడున్న రైల్వేసౌకర్యాలుగూడా యీజిల్లాకు సంబంధించినవిగా ఏర్పడలేదు. వివిధరాష్ట్రాలకు ఏర్పడి యున్నరహదార్ల నుద్దేశించి యీజిల్లాలోనుండి ఏర్పాటు చేయబడినవి ట్రంకురోడ్లుకూడా ఒకటి రెండు ముఖ్యమైన బాటలు తప్ప ప్రజాసౌకర్యము ననుసరించిలేవు గ్రామాదులలోనుండే ప్రజలకు సౌకర్యములు అసలులేవు ముడిసరుకు రైల్వేలైనుకు చేర వేసేదారులేతప్ప ప్రజలనిమిత్తము ఏర్పరచలేదు. ఒకతాలూకా ముఖ్యపట్టణం కోర్టు తదితర అవసరాలనిమిత్తం ప్రజలుచేరుకోవాలంటే, కొండలు గుట్టలకు అడ్డపడి కాలిబాటలవెంట చేరుకోవలసినదే గ్రామాలలో పండించే వ్యాపారపంటలు పట్టణాలకు చేరవేయాలంటేబహుకష్టము ప్రయాసలకు లోనుగావలసివచ్చును దీనివలన గ్రామికవర్గము చాలా నష్టపడుట జరుగుచున్నది యీ జిల్లాలో రాకపోకలసౌకర్యములు అభివృద్ధి కానందుననే వ్యాపార మభివృద్ధిచెందలేదు వ్యాపారాభివృద్ధిలేనందుననే అన్నివిషయముల వెనుకబడుటకు తోడ్పడుచున్నది ఆర్థికముగా అభివృద్ధి కవకాశములు తక్కువగానున్నవి. యిచ్చట ప్రజలు నూతనవృత్తులు కల్పించుకొనుట కవకాశములేదు. నేటిపరిస్థితులలో గ్రామాణప్రజలకు వైజ్ఞానికంగా ఏర్పడవలసిన వన్నిహిత తత్వమునకు దెబ్బ తగిలినది.

### తంతి తపాలా సౌకర్యాలు

భారతదేశంలోని మద్రాసురాష్ట్రముతోగాని మిగతా ఆంధ్రజిల్లాలతోగాని పోల్చిచూచుకుంటే యీ జిల్లాలో సౌకర్యాలు పట్టణాలలోతప్ప పల్లెలకు అసలే లేవని చెప్పవచ్చును తాలూకాలలోని ప్రతిమారుమూల గ్రామాదులకు ఉత్తర ప్రత్యుత్తర సౌకర్యములు లేవు పల్లెలలో పోస్టాపీసులు పిర్కాకు ఒకటికంటె ఎక్కువగ నుండుట చాలా అరుదు రెండేసి పోస్టాఫీసులకు యిరువది ముప్పది మైళ్ళ దూరముగూడా యుండును. ఒక కార్డుగాని కవరుగాని రెవిన్యూస్టాంపుగాని కావాలంటే పట్టణాలకు వెళ్లి తెచ్చుకొనవలసినదే వున్న పోస్టాఫీసులలోకూడా స్టాఫు తక్కువ ప్రతిదినము టపాసౌకర్యములుగల గ్రామాదులు చాలా తక్కువ అత్యవసరసమయాల్లో తంతి చేయవలసివస్తే పట్టణాలకు రావలసిందే తపాలా సౌకర్యములు తక్కువగుటచే యిక్కడ ప్రజలు ప్రపంచవార్తలకు చాలా దూరముగా యున్నారు దినపత్రిక కావలసివస్తే పట్టణాలకువచ్చి కొనుక్కొని పోవలసిందే పత్రికాప్రచారము చాలా తక్కువగా యున్నందున ప్రజలు చాలా వెనుకబడియున్నారు పత్రికాపఠనానికి అలవాటుపడాలంటే వారిని ప్రోత్సహించే తపాలా సౌకర్యములు లేవు. రేడియోలు లేవు. అందుచేత ప్రజలలో సహజంగా అభివృద్ధి చెందవలసిన విజ్ఞానాభివృద్ధి కలుగుటలేదు

### నీటి సౌకర్యాలు

అచ్చటచ్చట ఏ కొద్ది ప్రాంతాలలోనో



వాషింగ్టన్ సమీపంలో మేరీలాండ్ విశ్వవిద్యాలయంలో సంయుక్తరాష్ట్రాల భారత రాయబార కార్యాలయంవారు జరిపిన భారత చేతిపరిశ్రమల ప్రదర్శనంలో ప్రేక్షకులు కుతూహలంతో తిలకిస్తున్న కొన్ని వస్తు విశేషాలు.

పెరిగిపోవడంతో, అమెరికా ఆర్థికసహాయం లభించనిదే 1952 అనంతరం యూరప్ ఆర్థిక వ్యవస్థ కూలిపోక తప్పదని స్థిరపడిపోయింది.

## ఆంతర్యం *

ఈ పరిస్థితిలో బ్రిటన్ ఆటంకాల్ని తోసిపుచ్చి పశ్చిమ యూరోపియన్ ఆర్థిక వ్యవస్థ సమీకరణ సాధించడానికి మార్గాంతరం వెదకవలసిన అగత్యం కలిగింది. యూరోపియన్ ఫెడరల్ యూనియన్ పేరు చెప్పకుండా, చిట్టచివరికి ఆ లక్ష్యాన్ని సాధించే ఆశయంతో మొదటిమెట్టుగా ఫ్రెంచి విదేశాంగశాఖామంత్రి రాబర్ట్‌షూమన్ ప్రతిపాదించిన ప్రణాళికను షూమన్‌ప్రణాళిక అంటున్నారు.

ఈ ప్రణాళిక ఆంతర్యం పైన చెప్పినట్లు యూరోపియన్ ఆర్థికసమీకరణే అయినప్పటికీ ప్రస్తుతానికి రెండే ముఖ్య హేతువుల్ని చెప్తున్నారు. 1. ఫ్రెంచి, జర్మన్ పారిశ్రామికసహకారంద్వారా పశ్చిమ జర్మన్‌పరిశ్రమల్ని ఫ్రాన్సుపై యుద్ధానికి పని చెయ్యకుండా నిరోధించడం. 2. పశ్చిమ యూరోపియన్ వ్యాపార రంగంలో అనవసరమైన పోటీ, పక్షపాతపూర్వమైన ప్రభుత్వ నిర్బంధాల్ని తొలగించి, పారిశ్రామికోత్పత్తిని సక్రమమార్గంలో వృద్ధి పరచడం.

ప్రణాళిక ప్రస్తుతకార్యక్రమం ప్రకారం ఫ్రాన్సు, పశ్చిమజర్మనీలలో కల ఉక్కు బొగ్గు పరిశ్రమల్ని ఏకముఖంగా, సమాన ప్రాతిపదికపైన నిర్వహించడం.

ఈ రెండు పరిశ్రమల సమీకరణలో ఫ్రాన్సు పశ్చిమజర్మనీలే కాక, బ్రిటన్, ఇటలీ, బెల్జియం, హాలండ్, లగ్జెంబర్గులు కూడా చేరవచ్చునని షూమన్ ఆహ్వానాలు పంపించాడు. ముందుగా ఈ ప్రణాళిక లక్ష్యాలకు సమ్మతించాలనీ, ఆ లక్ష్యాల్ని ఏరీతిగా సాధించాలో కార్యక్రమాన్ని నిర్ణయించడంతోపాటే సమాలోచనలు జరుపవలసి ఉంటుందనీ ఫ్రెంచిప్రభుత్వం స్పష్టపరిచింది. కాని లక్ష్యాల్ని ముందుగా అంగీకరించాలనే నిర్బంధాన్ని బ్రిటన్ నిరాకరించింది. అసలు ప్రణాళికఆంతర్యాన్ని లక్ష్యాల్ని గురించి చర్చ జరపాలనీ, చర్చల అనంతరం ఇది యోగ్యమైనదని తమకు తోచినపక్షంలోనే కార్యక్రమనిర్ణయ చర్చల్లో పాల్గొనడానికి వీలుపడుతుందనీ బ్రిటిష్ ప్రభుత్వం స్పష్టపరిచింది. మిగతా అయిదు దేశాలూ ఫ్రాన్సు ఆహ్వానాన్ని అంగీకరించాయి. కాని వాస్తవానికి ఇటలీ, బెల్జియం ప్రభుత్వప్రతినిధులు అసలుసంగతేదో చూడాలనే ఉద్దేశంతో పారిస్ సమావేశానికి వచ్చారు. పారిస్ సమావేశంలో కార్యక్రమవిధానం గురించి ఫ్రెంచిప్రభుత్వానికి ఏ నిశ్చితాభిప్రాయం లేనట్లు, అసలు ఈ ప్రణాళిక క్రమక్రమంగా ఈ రెండు పరిశ్రమల్నే కాక ఆ దేశాల ఆర్థిక వ్యవహారాలన్నిటిలోకీ ప్రవేశించడం ఆంతర్యమైనట్లు, ఈ ప్రభుత్వాలన్నిటిపైనా ఆధిపత్యం వహించగల యూరోపియన్ ఫెడరల్ యూనియన్‌గా పరిణమించగల వీలున్నట్లు తెలిసింది. అంతలో ఆ ప్రభుత్వాల ప్రతినిధులు తమతమ ప్రభుత్వాల్ని సంప్రదించడానికి వ్యవధి కావాలని వెళ్లిపోయారు.

## ప్రణాళిక వివరాలు *

ప్రణాళికను గురించి ఫ్రెంచి విదేశాంగ మంత్రి షూమన్, అతని సలహాదారు జీన్ మానెట్ ఇంతవరకూ ఇచ్చిన ఉపన్యాసాల్ని బట్టి ఈక్రిందవివరాలు తెలియవస్తున్నాయి.

ఉక్కు, బొగ్గు ఉత్పత్తివిధానం, యాజమాన్యం, విక్రయం, కార్మికవ్యవహారాల నిర్వహణ నిమిత్తం ఆయా ప్రభుత్వాలకు ఉత్తరు విచ్చగల అంతర్జాతీయఉన్నతాధికారసంస్థ ఒకటి నెలకొల్పబడుతుంది.

ఈ ఉన్నతాధికారసంస్థ సరిగ్గా ఫెడరల్ రాజ్యాంగంపోలికనే ఉంటుంది. అంటే దీనికి మంత్రివర్గంవంటి ఒక సంఘం, శాసనసభవంటి ఒక సభ, సుప్రీంకోర్టువంటి ఒక న్యాయస్థానం ఉంటాయి. ఈ ప్రణాళికలో చేరే ప్రభుత్వాలన్నీ కొందరు వ్యక్తుల్ని పంపగా, వారితో ఈమంత్రివర్గం నిర్మించబడుతుంది. ఈమంత్రివర్గం కార్మికుల వేతన ప్రమాణాలెంతెంత ఉండాలో నిర్ణయిస్తుంది. ఉత్పత్తైన బొగ్గు, ఉక్కు ఇనుముల ధరల ప్రమాణాల్ని నిర్ణయిస్తుంది. ఏయే దేశాలకి ఎంతెంత ధరలకి ఎన్నెన్ని టన్నులు చొప్పున ఎగుమతి చెయ్యాలో నిర్ణయిస్తుంది. ఈ మంత్రివర్గం చేసే నిర్ణయాల్ని ఆ ప్రభుత్వాలు విధిగా అనుసరించవలసిందే. అంటే ఆ ప్రభుత్వాలు తమకు చెందిన కొంత అధికారాన్ని ఈ సంస్థకు ఒప్పగించెయ్యాలన్నమాట.

ఆ దేశాల పార్లమెంటులు ఎన్నుకునే సభ్యుల్ని అందర్నీ చేర్చి ఈసంస్థ శాసనసభగా నిర్మిస్తారు.

ఈశాసనసభ ఏడాదికొకసారి సమావేశమై మంత్రివర్గం సమర్పించే వార్షికనివేదికను బహిరంగంగా చర్చిస్తుంది. ఈశాసనసభ మంత్రివర్గంపైన విశ్వాసరాహిత్య తీర్మానం చెయ్యవచ్చును. అలా చేసేపక్షంలో ఆమంత్రివర్గం మొత్తంగా రాజీనామా ఇవ్వవలసి ఉంటుంది.

మంత్రివర్గం చేసే నిర్ణయాలు ఏప్రభుత్వానికైనా నచ్చకపోతే ధిక్కరించడానికి వీల్లేదు. ఈ అవసరంకోసం ప్రత్యేకంగా నిర్మించబడే న్యాయస్థానంలో దావా వెయ్యాలి. ఆ న్యాయస్థానం ఇచ్చే తీర్పు తుదినిర్ణయం.

రాజ్యాలు తమ రాజ్యాధికారానికి భంగంలేకుండానే ఇంతవరకూ అంతర్జాతీయ సంస్థల్ని నడుపుతూ వచ్చాయి. యూరోపియన్ ఎసెంబ్లీకికూడా పశ్చిమ యూరప్ రాజ్యాలు ఎట్టి ఉన్నతాధికారాన్నీ ఇవ్వలేదు. ఐక్యరాజ్యసమితికీ, నానారాజ్యసమితికికూడా ప్రభుత్వాలు అధికారాన్ని ఒప్పగించలేదు.

ఈరీతిగా అధికారాన్ని వొదులుకుని ఒక అంతర్జాతీయసంస్థకు ఒప్పగించడానికి ఈ ప్రయత్నమే మొదలు. బ్రిటన్ మొదటే ఈ ప్రణాళికలో చేరకుండా నిరాకరించడానికి ఇదొక ముఖ్యకారణం.

తన ప్రణాళికను వివరిస్తూ షూమన్ ఈక్రింది వివరాలపైన చర్చ జరుగవలసి ఉంటుందన్నాడు.

1. వీలైనంత అల్పవ్యవధిలో బొగ్గు, ఉక్కు, ఇనుముల ఉత్పత్తి విధానాన్ని సంస్కరించి మేలైన పద్ధతులు అమలు జరపడం. వస్తువు నాణ్యం వృద్ధిపరచడం.

2. ఫ్రెంచి, జర్మన్ మార్కెట్లలోనూ, ఈప్రణాళికలో చేరబోయే దేశాలమార్కెట్లలోనూ ఒకే రకం షరతులపైన, సమానమైన ధరలకి బొగ్గు, ఉక్కు విక్రయించడం.

3. అన్యదేశాలకు ఎగుమతి చెయ్యడంలో ఈప్రణాళిక దేశాలన్నీ ఒకే వ్యవహారవిధానాన్ని అనుసరించడం.

4. ఈ రెండు పరిశ్రమల్లోనూ కార్మికుల జీవన వ్యయప్రమాణాన్ని ఒకే స్థితికి తెచ్చి వృద్ధిపరచడం.

(39-వ పేజీ చూడుడు)



ఎలెక్ట్రికల్ మోటారుతో నడుపబడుతున్న సానమీద రైతు
కోతయంత్రంలో కత్తికి పదును పెడుతున్నాడు.



వర్జీనియాలోని వ్యవసాయ గేంద్ర
ఎలెక్ట్రికల్ సామానులను

# అమెరికా వ్యవ
# విద్యుచ్ఛ



కొలంబియా నదిమీది కూలీ ఆనకట్ట దీనినుంచి 30 వ్యవసాయ
క్షేత్రాలకు విద్యుచ్ఛక్తి సరఫరా అవుతుంది.



ఎలెక్ట్రికల్ సౌకర్యాలన్నీ అను



ంలో ఒక రైతు ఇల్లాలికి రకరకాల
ాడటం ఎలాగో నేర్పుతున్నారు.





• వ్యవసాయ క్షేత్రాలలోని కుటుంబాలకు నగరవాసులకుండే
రేడియో, ఎలెక్ట్రికల్ స్టౌ వగయిరా అన్ని సౌకర్యాలూ ఉంటై.

# సాయక్షేత్రాలలో
# క్తి ప్రభావం





నవించుచున్న ఒక రైతు కుటుంబం.





విద్యుచ్ఛక్తి సహాయంవల్ల రైతులు రాత్రివేళకూడా పనిపాటలు
చేసుకొనే అవకాశం కలుగుతోంది.



రాజకమల్ కళామందిర్ వారి 'దహేజ్'లో ప్రతిభావంతంగా నటించిన జయశ్రీ

వ్యంగ్యరచన

# 'అఖిలభారత సినిమాతారల సమావేశం'

[శ్రీ ఎస్. వసంతకుమార్]

★

ఆగస్టు 16 స్వాతంత్రదినోత్సవం తర్వాత భారతదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగినది ఈ చారిత్రాత్మకమైన సమావేశం. ప్రఖ్యాతివహించిన భారత దేశపు నటీమణులు అందరూ సుందరీబాయిహాలులో 1950 ఫిబ్రవరి 26 వ తేదీ సమావేశమైనారు. ఆ సమావేశానికి అధ్యక్షత వహించటానికి శ్రీయుత చమన్‌లాల్ గారు దయతో అంగీకరించారు. రాత్రి 7 గం|| సభను ప్రారంభిస్తూ శ్రీ చమన్‌లాల్ గారు చాలా సేపు మాట్లాడారు వారు అసలు ఈ ఫిలింపరిశ్రమ కనిపెట్టింది భారతీయులు ఒక్కరే నని గట్టిగా వక్కాణించారు. అందుకు మహాభారతం నిదర్శన మన్నారు.

సంజయుడు ధృతరాష్ట్రుడికి భారత యుద్ధపు పిల్మ్ చూపించాడట. అంతే కాక అది పంచరంగుల పిల్మ్ అనికూడా చెప్పారు. కాని దేశంలో మహాభారతయుద్ధంవలన చెలరేగిన సంక్షోభంలో మనపూర్వీకుల కళలన్నీ అణగారిపోయినై దేశంలో 'కళే'పోయింది ఒక్క పిల్మ్‌లేకాదు ఆటంబాంబులు గూడా మనవాళ్లే కనిపెట్టారు. అంతేకాదు హైడ్రోజన్ బాంబుకూడా మన దే. పాశ్చాత్యులు మన ప్రాచీనగ్రంధాలు చదివి ఇది గ్రహించగలిగారు ఈ మారణాయుధాలన్నీ మన పూర్వీకుల కాలంలో ఉండేవి కాని వాటిని అప్పుడు రోగబాంబులు అనేవారు. శివుడు ఒక్కసారి ప్రపంచం భస్మంచేయుటం ఈ రోగబాంబులవల్లనే కాని ఈనాడు మనలో ఉన్న పరస్పరవైషమ్యాలే మన ఈ పరిస్థితులకి కారణమయినై అయినప్పటికి ఈ నాటి మనమంత్రులలో, నాయకులలో ఎవరైనాసరే మానససరోవరసరస్సుకి పోయి 30 ఏళ్లు తపస్సుచేస్తే మనం తిరిగి మనపూర్వశక్తుల్ని ఆయుధాల్ని సంపాదించగలుగుతాం నేను ప్రశ్నిస్తున్నాను నిజంగా ఎవరైనా అటువంటి త్యాగం చెయ్యగలవారువున్నారా అని. (సభలో 'లేరు లేరు' అని కేకలు) నాకు తెలుసు ఎవరూ తెగించలేరని ప్రపంచంలోని అన్నిదేశాలనాయకులకంటే మన భారతదేశనాయకులకు మన సినిమాతారలంటే మిక్కిలి ప్రేమ, అనురాగం అని అందరికీ తెలుసు (హియర్, హియర్ అని కేకలు చప్పట్లు) నిజంగా ఈనాడు మన భారతదేశభవిష్యత్తు అంతా మీవంటి సినిమాతారల మీదనే ఆధారపడివు[illegible] కాబట్టి మీరంతా దీక్షతో దేశంకోసం పనిచెయ్యాలి చైనా, ఇండోచైనా, బర్మా, మలయా, కొరియా దేశాలలో ఎలా విప్లవజ్వాలలు చెలరేగి అశాంతి ప్రబలిపోతోందో చూడండి. ఇటువంటి పరిస్థితులలో మీరు చెయదగినపని ఎంతైనావుంది. కాని ఫిలింపరిశ్రమయందు మన ప్రభుత్వం తగిన శ్రద్ధ తీసుకోటం లేదు మీరుఅందరూ రేపటినుంచే ఖద్దరుబట్టలు కట్టి, వారానికి ఓ పూట ఉపవాస ముంటూ, దీక్షగా వుండండి. ఈ సర్వోదయప్రిన్సిపల్స్ వలననే మన పిలింపరిశ్రమ అభివృద్ధిలోకి రావాలి. ఆ రోజునే మీరు ఇతరఖండాలతో పిలింపీల్డులో పోటీచేసి గెలుపొందుతారు. (సభలో చప్పట్లు) శ్రీ చమన్‌లాల్ గారి ఉపన్యాసం అయిన తర్వాత వెండితెర అందాలరాణి శ్రీమతి జాస్మిన్ కొలదిసేపు ఫిలింపరిశ్రమ

గురించి మాట్లాడింది. అంతటితో ఆ రోజు సమావేశం ముగిసింది.

మర్నాడు రాత్రి 7 గం॥ సబ్జక్టు కమిటి సమావేశమైంది. దీనికి ప్రేక్షకులను ఎవర్నీ రానివ్వరు. పత్రికావిలేఖరులు, పోలీసువారు మాత్రం రావచ్చు. ఆ సమావేశానికి వచ్చిన వారిలో ముఖ్యులు మిస్ కర్గిస్, మిస్ కురయ్య, మిస్ ఫిగార్, మిస్ ఫెతాబాలి, మిస్ మస్తానా. మొదటి ప్రతిపాదన సభలో అందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు.

సంవత్సరానికి 35 కాంట్రాక్టులు వచ్చే తారలు స్టాండర్డు హీరోయిన్సు. సంవత్సరానికి 16 వచ్చేవారు 'A' క్లాసు హీరోయిన్సు. 8 కాంట్రాక్టులు వచ్చేవారు 'B' క్లాసు హీరోయిన్సుగా పరిగణించబడతారు. సంవత్సరానికి 8 కన్నా తక్కువ కాంట్రాక్టులు వచ్చేవారు సైడ్ హీరోయిన్సుగా యెంచబడతారు. అటువంటివారు మెడికల్ సర్టిఫికేట్ లేనిదే షూటింగుకి రాకుండా ఉండకూడదు. స్టాండర్డ్ హీరోయిన్సు 'A' క్లాసు వారు. వారి యిష్టం వచ్చినప్పుడు ఎవరికీ తెలియపర్చకుండానే షూటింగ్ కి రాకపోవచ్చు. ఈ ప్రతిపాదనని మిస్ ఫిగార్ సెకండ్ చేసింది. అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు. తర్వాత స్టూడియోలలోని అసభ్యకృత్యాలనిగురించి చాలా సేపు తీవ్రంగా చర్చించారు.

నాకు ఫిల్ములలో నటించాలని ఉంది కాని మన సెట్లో బొద్దింకలు, బల్లులు ...



ఎ వి ఎం వారి 'జీవితం'లో వైజయంతీమాల, టి. ఆర్. రామచంద్రన్

చూస్తుంటే నాకు భయం వేస్తోంది. ఎందుకో ఎప్పుడూ నావంక అదోమాదిరిగా చూస్తుంటాడు అంది మిస్ చంపకాలి

'ఆసిసేరియో రచయిత చంద్ నిన్న స్టూడియోలో కలిసినప్పుడు నేను అతన్ని ప్రేమించకపోతే నాకు ఉన్న మంచి డైలాగ్సు అన్నీ కట్ చేస్తానన్నాడు నేనేం చేసేది?" అంది మిస్ చార్జి

ఆ కెమెరామెన్ ఎప్పుడూ నా దుంప తెంపుతుంటాడు నేను అతనితో 'కో ఆపరేట్' చేస్తే నాకు మంచి ఆంగిల్సు సెలక్టు చేస్తాడట మరి నేను అతనికి ఏవిధమైన 'కో ఆపరేషన్' (సహకారం) ఇవ్వాలో అర్థం కావడంలేదు అంది మిస్ చీతాజిజామి.

పైకి రావటమే ప్రధానమ కాబట్టి ఇటువంటి చిన్న విషయాలలో అంత పట్టింపు అక్కర్లేదు అన్నారు తర్వాత చాలా విషయాలు ముచ్చటించారు. కాని అందులో కొన్ని ముఖ్యమయినవి ఉన్నయ్ గవర్నమెంటుని డాలర్ సౌకర్యాలు కలిగించమని లేకపోతే తమ కుక్కలకు అమెరికానుంచి ఆహారపదార్థాలు తెప్పించుకోటానికి వీలుండదని కోరారు.

మన ఫిల్ములు ఎంత పొడవు ఉండాలంటారు అని అడిగింది మిస్ కర్గిస్.

డ్రము సినిమా తిరుచ్చిలో రెండో సంవత్సరం నడుస్తోంది కాని ఇంతవరకూ ఇంకా మొదటి ఆట కాలేదు. అంది మిస్ ఫిగార్

కోయంబత్తూరులో నేను హీరోయిన్ గా ఒక ఫిల్ము షూటింగు ప్రారంభించారు. ఇప్పుడు ఆ సినిమాలో నా కూతురు హీరోయిన్. కాని ఇంతవరకూ చిత్రం పూర్తి కాలేదు. అంది మిస్ జబ్బాకుసుం.

(1) 40 వేల అడుగులకంటె ఎక్కువ పొడవుగా ఫిల్ములు తీయరాదనీ,

(2) ఒక చిత్రంలో 50 పాటల కంటె ఎక్కువ ఉండరాదని,

(3) 6 సం॥ కన్నా ఎక్కువ కాలం చిత్రనిర్మాణం సాగరాదని,

(4) 10 కోట్లకన్నా పబ్లిసిటీ ఖర్చు పెంచరాదని,

ప్రొడ్యూసర్లను కోరుతూ ఒక తీర్మానం ప్రతిపాదించారు

ఆఖరి ప్రతిపాదన చాలా ముఖ్యమయినది

నటీమణులలో కొంతమంది బయలుదేరి ప్రభుత్వంతో రాయబారం సాగించాలని తీర్మానించారు ఆ రాయబారంలోని విషయాలు

(1) అమెరికన్ ఫిల్ములను బాన్ చేయ్యాలి లేదా,

(2) భారతదేశపుతారలుకూడా తెరపై ముద్దుపెట్టుకోవచ్చు తమకాళ్లనీ, నగ్నంగా చూపించటానికి ప్రభుత్వం అంగీకరించాలి

ఇంతటితో అఖిలభారత సినిమాతారల సమావేశం సమాప్తమయింది

(ఇందులోని పాత్రలన్నీ కల్పితములు. ఎవరినీ ఉద్దేశించి వ్రాసినవి కావు. ఈ వ్యాసానికి "కృష్ణచంద్ర" వ్యాసం ఆధారం)



శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీవారి 'సౌదామిని'లో టి. ఆర్. రజని

కలెక్టరుగారూ! వీరు అవినీతినిర్మూలనసంఘ స్థాపకులు. ఆ విషయంలో చాలా కృషి చేస్తున్నారు. నేనుకూడా ఉడతాభక్తిగా ఈ సంఘంలో పనిచేయదలచుకున్నాను. మీలాంటి అధికారులు మాకు ప్రాపుఉంటే ఎంతైనా దేశసేవ చేయవచ్చు.

కలె : అవశ్యం మాకు అంతకన్నా కావల్సిం దేముందండీ.

లలిత : నాన్నగారూ, వీరు అవినీతి నిర్మూలనకు కొత్తగా ఈ ఊళ్లో అపాయింటు అయిన ఆఫీసర్లు. పేరు రాఘవయ్యగారు.

నారా : నమస్కారమండీ.

రాఘు : నమస్కారమండి. క్షమించాలి. నేను ఉద్యోగధర్మంలో మీవద్దకు వచ్చాను. కలెక్టరుగారు కూడా ఇక్కడే ఉన్నారు కాబట్టి నాపని మరింత తేలికయింది.

నారా : చెప్పండి ఫరవాలేదు, నాకు చేతనైన సహాయం చేస్తాను.

రాఘు : మిమ్మల్ని అరెస్టు చేయించటానికి వచ్చాను.

కలె, లలి : ఆఁ, ఆఁ, ఏమిటిది.

నారా : (నవ్వుతూ) నాకు జైలు కొత్త కాదు. కాని స్వరాజ్యం వచ్చాక కాస్త అలవాటు తప్పింది.

రాఘు : కలెక్టరుగారూ, ఈ చెంగయ్యగారూ, శంకరయ్యగారూ, నాకు బ్లాకు మార్కెటువాళ్ళను పట్టుకోటంలో సహాయం చేస్తామని నారాయణరావుగారి దగ్గరకు తీసుకొచ్చారు.

చెం : అబద్ధం. వారు మాకు అధ్యక్షులు అనీ, వార్ని చూపించమనీ అంటే వెంట వచ్చాం.

శంక : ఏమో, గ్లూకోజు బ్లాకు మార్కెటు చేస్తున్నారని మీరే చెప్తే సంగతేమిటో కనుక్కుందామని మేం వచ్చాం. మీ రిల్లా విశ్వాసఘాతకంగా తిరుగుతారని మేం అనుకోలా. పోతే గ్లూకోజ్ డబ్బాలు ఇక్కడ దొరకనే దొరికాయాయె. అయినా పేరున్నవాళ్లమీద ప్రచారం నాకెందుకు లెండి.

నారా : నేను గ్లూకోజు బ్లాకుమార్కెటు ఎందుకు చేస్తానండీ. నా పేషెంట్సుకి వాడటానికే ఎన్ని డబ్బాలైనా కావాలే. అవి లేకే ఇబ్బంది పడుతూన్నాను.

రాఘు : మరి ఈ డబ్బాలు ఎక్కడివండి. ఇవి ఇక్కడ ఉన్నట్లు మీకంటె శంకరం గారికే ముందు తెలిసింది.

నారా : నాకు తెలియదే, ఇందాకా పేషెంట్సుకోసం ఎవరో ఆవిడ ఇచ్చి వెళ్లారని ఇంట్లో చెప్పారు.

శంక : ఔనులెండి. ఇంట్లో వాళ్లు సాక్ష్యమేగా.

లలిత : ఆగండి, వీరాయి.

నారా : వీరాయి ఎందుకమ్మా.

లలిత : చెప్తా.

వీరాయి : (ప్రవేశించి) ఏమండమ్మా.

లలిత : ఇందాక ఈ డబ్బాలు ఎవరు ఇచ్చారు.

వీరాయి: ఆ మూడో సందులో ఉంటారు, వెంకమ్మగారు. ఆవిడ ఇచ్చారు. శంకరం గారి భార్య, ఇదుగో ఆరూ ఇక్కడే ఉన్నారే.

శంకరం (కోపంతో గట్టిగా) వట్టి అబద్ధం, వీళ్లంతా నామీదకి బనాయిస్తున్నారు. ఇల్లాంటి అమర్యాద అయే చోట్ల నిలువకూడదు. దా చెంగయ్యా పోదాం.

రాఘు : ఆగండి, ఆగండి, చెంగయ్యగారూ! ఈ పుస్తకం మీదేనా ?

చెం : ఆ. ఆ. శంకరయ్య నా కొంప ముంచావ్. అది దాచమనిస్తే అజాగ్రత్తగా పారేశావ్.

కలెక్టరు : (చదువుతూ) బ్లాక్‌మార్కెటు చిట్టా, శహబాష్, చెంగయ్యగారూ బలే చిట్టా ఉంచారే.

చెంగ : (ఏడుస్తూ) నాది కాదు బాబూ, ఆ శంకరయ్యదే.

శంక : నోర్ముయ్. నాకు తెలియదు. నే వెళ్తున్నా.

రాఘు : ఆగండి, పోనీ ఆ చిట్టా ఆయనదే, ఈ నోటుబుక్కు మాటేమిటంటారు. బ్లాక్‌మార్కెటు అన్న పేరు లేదుగాని, దీంట్లో లెక్కలు జమాకర్చు అన్నీ అవేనే. కలెక్టరుగారూ చిత్తగించండి. ఇద్దరికీ రొండీని మాటలున్నట్లున్నాయి. అవీ విప్పించండి.

కలెక్టరు : ఆరిదగుల్బాజీలు, ఇదేమిటి శంకరం దగ్గిర వెయ్యి రూపాయిలా. చెంగయ్యదగ్గిర రామయ్య పేరిట పర్మిట్లా ?

రాఘు : అంతేకాదండీ, ఆకాశరామన్న అర్జీల దస్తూరీ ఈ శంకరయ్య నోటుబుక్కు దస్తూరీ కాస్త గమనించండి.

లలిత : బలే! భలే! ఏళ్లంతా అవినీతి నిర్మూలనసంఘసభ్యులా, నాన్నగారూ తెలిసికోకుండా ఈ సంఘఅధ్యక్షులయినందుకు మీరూ పాపం పంచుకోవలసిందే.

నారా : నిజమేనమ్మా.

కలె : (వీరాయి తో) అబ్బాయీ, మా డ్రైవరును పిలచి వీరిద్దరినీ కారులో ఎక్కించి జాగ్రత్తగా పోలీసుస్టేషనుకు తీసుకుపొమ్మను. నేనూ వస్తున్నా.

చెం : (ఏడుస్తూ) నా కొంప ముంచావ్ శంకరయ్యోయ్. శంకరయ్యా.

శంక : ఛీ. నోర్ముయ్.

కలె : రాఘువయ్యగారూ, కంగ్రాచ్యులేషన్స్, మీ లాంటి ఆఫీసరు అండను ఉంటే ఈ జిల్లాను నాల్గు రోజుల్లో బాగు చేస్తాను. లలితా, మీనాన్నగారు సంఘానికి అధ్యక్షులైనందుకు ఏమీ అభిమానపడనక్కర్లేదు. ఇవాళనుంచి వారూ నేనూ, రాఘువయ్యగారూ కూడా సభ్యులౌతాము.

రాఘువ : నారాయణరావుగారూ, కొంత నాటకమాడే యౌవనపు ఉత్సాహంతో దురుసుతనంగా ప్రవర్తించినందుకు క్షమించాలి.

నారా : రాఘువయ్యగారూ, ఆ దురుసుతనం వల్లే నన్ను మరింత రక్షించారు. మీకు కృతజ్ఞుడను. కలెక్టరుగారూ, ఒక్క కోరిక. వీళ్ళదగ్గిర ఉన్న వస్తువులు వశం చేసుకొని క్రమంగా జనానికి పంపిణీలు చేయించి, ప్రథమతప్పిదంగా వీరిని వదిలేయాలని నా కోరిక.

రాఘువ : మిమ్మల్నీ ఊళ్లో ఇంత రభస పెట్టినవాళ్ళను కరుణిస్తారా నారాయణగారూ.

నారా : అవన్నీ మర్చి పోదామండి. మనకి సత్క్రియ జరగడం ముఖ్యం కాని ఒకళ్ళమీద పగకాదుగదా. అయినా - కలెక్టరుగారూ - మీ అమ్మాయికి వైద్యం చేసినందుకు ఫీజుగా నాకీ ఉపకారం చెయ్యాలి.

కలె: (నవ్వుతూ) ఇది మీకు ఉపకారంటండీ. సరే వెళ్లి వస్తాం. కృతజ్ఞులం. రండి రాఘువయ్యగారూ పోదాం. (రాఘువయ్యతో) ఇల్లాంటి మంచివాళ్ళను బెట్టుకొని చెడ్డవాళ్లను శిక్షించటం ఎల్లా కుదురుతుందండీ ?

రాఘువ : ఒకవేళ అదే ఉత్తమశిక్షా విధానమేమో లెండి. నమస్కారం.

---



# బాలానందం

## తండ్రిప్రేమ

శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం

రామయ్యకు ఇద్దరు కుమారులు. పెద్దకుమారుడు కృష్ణారావు తండ్రికి కుడిభుజంలాంటివాడు. తండ్రికి పనిపాటలలో ఎంతో అండ. రెండవకుమారుడు గోపాలానికి యింటిపనులంటే ఏమాత్రం శ్రద్ధ లేదు. పని చెపితే చీకాకుపడతాడు. ఎప్పుడు ఆషామాషీగా మంచి దుస్తులు వేసుకొని తిరగటం అతని కెంతో ఆనందాన్ని కలిగిస్తుంది.

చాల సంవత్సరాలు అన్నదమ్ములు సమిష్టిగానే ఉంటూ వచ్చారు. కాని గోపాలానికి అది ఏమాత్రము ఇష్టంలేదు. తను స్వతంత్రుడుగా జీవించాలని అతని కోర్కె. తన ఆస్తిపాస్తులు తన యిష్టంవచ్చినట్లు చేసుకొనే అధికారం అతనికి కావాలి.

ఒకనాడు తండ్రిచెంతకు పోయి గోపాలం "నాన్నా! నాకు బస్తీలో జీవించాలని ఉన్నది. నా వాటా యెంత వస్తుందో నాకిచ్చేసేయి. "నేను దానితో స్వతంత్రుడుగా ఉంటాను" అని చెప్పాడు. గోపాలంమాటలు తండ్రి కెంతో విచారాన్ని కల్గించాయి.

స్వస్థలాన్ని వదలివెళ్ళి కానిరోజుల్లో కానిచోట్ల ఏ బాధ పడతాడో తన బిడ్డయని దుఃఖించాడు. తన కున్న ఆస్తి చాల కొద్ది. అందులో గోపాలానికి వచ్చే వాటా అతనికి కూర్చునితింటుంటె ఎంత కాలం వస్తుంది? తన బిడ్డకు క్రొత్తప్రదేశంలో లభించే స్నేహితులు మంచి వాళ్లు కాకపోవచ్చు. వాళ్లు అతని జీవితాన్నే నిర్మూలం చెయ్యవచ్చు. ఇన్ని ఆలోచనలతో రామయ్య తన బిడ్డ ఉద్దేశ్యాలను మార్పించటానికి ఎంతో ప్రయత్నం చేశాడు.

తండ్రిసలహాను గోపాలం పాటించలేదు; పెడచెవిని బెట్టాడు. తన వాటా తనకు కావలసిందే అని మంకుపట్టు పట్టాడు. తాను మంచి వాళ్లతోనే స్నేహం చేస్తానని, ఇంకా తాను ఏదోవిధంగా జీవనోపాధి గడుపుకుంటూ ఈ ఆస్తిని వృద్ధిచేసుకుంటా నని తండ్రికి జెప్పాడు. గోపాలంప్రయోజకత్వం రామయ్యకు తెలుసు. ఎంతో అయిష్టంమీద అతని వాటా అతని కిచ్చాడు రామయ్య. ఏమైనా సరే నని! వెంటనే గోపాలం బస్తీ చేరాడు. అక్కడ తన నివాసం ఏర్పఱచుకొన్నాడు.

చేతినిండా డబ్బు గలగలలాడుతోంది. ఒక పెద్ద బంగళాలాంటి యిల్లు అద్దెకు పుచ్చుకొన్నాడు. సిల్కులాల్చీలూ, సిల్కు ధోవతులూ ధరిస్తూ, పూర్వపు జమీందార్లపాయలో మనుగడ ప్రారంభించాడు. నిరుద్యోగశాఖపెద్దగుమాస్తాలకు, దేశద్రిమ్మరులకు అప్పుడే యితని గాలి సోకింది. నిత్యం వాళ్లు



చనిపోయినట్లైతే నా వంశగౌరవము, నా పరువు, మర్యాదా.. ..."

హాడాకు భర్తమాటలమీద సందేహం కలిగింది.

"స్వామీ! తమరు న్యాయము కొరకు, ధర్మముకొరకై పోరాడబోతున్నారు ఈసమయములో స్త్రీలమగు మేము మీకోచితధర్మానికి భంగము రానీయము, మాపాతివ్రత్యానికి భంగముకలుగదు మీరు నిర్భయముగా ధర్మముకొరకై పోరాడి విజయలక్ష్మిని చేపట్టండి"

చందావతు యుద్ధానికి పోయినాడు. పోతూ తనభార్యకు పాతివ్రత్యధర్మాలను బోధించడానికి ఒక వృద్ధపురోహితుని నియోగించాడు పురోహితుడు వచ్చి హాడాకు ధర్మపన్నాలు చెప్పడం మొదలెట్టినాడు.

హాడా ఆలోచించింది. నా భర్త నా సౌందర్యానికి లోనైనాడు అందుచే ఆయనకు హృదయదౌర్బల్య మేర్పడింది ఈస్థితిలో వారు ఉత్సాహోద్రేకాలతో యుద్ధం చేయలేరు. ధర్మాన్ని, దేశాన్ని, రూపనగరరాకుమారిని రక్షింతురు. దీనికంతకూ కారణం నా సౌందర్యం. ఈ పాపం నన్ను చుట్టుకుంటుంది. ఈ పరిస్థితిలో ఏమి చేయవలెనా" అని ఆమె పరిపరివిధాల ఆలోచింపసాగింది ఇంతలో మెరపులా ఆమెకొక ఆలోచన తట్టింది. ఆమెముఖము వికసించింది, ధర్మంకొరకు. న్యాయంకొరకు తన ప్రాణాలను బలిపెట్టడానికి నిశ్చయించుకొన్నది. వెంటనే కత్తి తీసికొని, దాసీని పిలిచింది. "చూడు ఇదుగో యీ నా శిరస్సు, యీ ఉత్తరం తీసికొని వెళ్లి పురోహితులవారికియ్యి, వారు వీటిని నా స్వామి కందజేస్తారు". అంటూ ఆమె కత్తిలో తనశిరస్సును ఒకవేటుతో ఖండించుకొన్నది.

పురోహితుడు లేఖను శిరస్సును చందావతుకు అందజేసినాడు. ఆ లేఖయం దిట్లున్నది.

స్వామీ! తమరు నా సౌందర్యానికి లోనై యుద్ధానికి పోవడానికి వెనుకముందాడినారు. ఉత్సాహోద్రేకాలు లేని సేనాపతి సైన్యాన్ని సరిగా నడిపించలేడు. ఏ సౌందర్యానికి మీరు దాసులైనారో, ఆ సౌందర్యదేవతశిరస్సు యిది. ఇక మీరు అన్యాలోచన లేకుండా దేశాన్నీ ధర్మాన్నీ రక్షించండి."

ఉత్తరము చదివి చందావతు దుఃఖించాడు కొంతసేపటికి అతనిలో రోషముప్పొంగింది. భయంకరంగా పోట్లాడి చివరకు వీరస్వర్గమలంకరించాడు.



వరంగల్ కార్మికమహాసభ సందర్భంలో హైద్రాబాద్ మంత్రులు రామకృష్ణారావు బసవరాజు గార్లను కార్మిక నాయకుల స్వాగతం

బాలానందం.

# కవితావస్తువు

**శ్రీమతి వడలి వెంకటరామలక్ష్మి**

సాయంకాలమయింది. కవిగారు తోటలో పచారుకు బయలు దేరారు. కవితావస్తువుకోసం ఆలోచిస్తున్నారు. కవిగారికి హుషారుకోసం వేడివేడి టీ యిద్దామనే కుతూహలంతో, టీ అమ్మేవాడు ఓ కప్పు టీ తీసుకొచ్చాడు.

కవిగారు ఆలోచనలోంచి తేరుకుని టీవాడిని తేరిపారచూశారు. నల్లని మసిపాతలు కట్టుకొని, అసహ్యమేస్తున్న అతడు, అతని మురికి చేతులు, అంతకన్న మురికిగా ఉన్న టిన్ను రేకు డొక్కులో తొరకలు తుక్కుతో నిండిఉన్న టీ, చూడగానే, కవిగారికి యెక్కడలేని అసహ్యం వేసి, వాంతి అయేపర్యంతం అయింది

"ఛీ! పో మురికివెధవ! నువ్వూ నీటీ కలిసి మురుగు కాలువలో దూకండి" అంటూ నాలుగు తిట్టి-తనలో ఇల్లా అనుకున్నాడు-

"యేమిటో! యీ దేవుడు యిలాటివాళ్ళని సృష్టించడంలో అర్థంలేదు"

చెమటోడ్చి పొట్టనింపుకోలేని ఆ నిరుపేదఆకారం- మురికిచేతులు- మురికిటీపాత్ర - తొరకల టీ మాత్రమే కవి చూడగలిగాడు గాని వాడూ మనిషేననే విషయం అతని మనస్సుకు తట్టలేదు. చూపుకు అందలేదు!

కవిగారు అక్కడనుండి యింకో అడుగు ముందుకు వేశారు

కవిగారిని వెక్కిరిస్తూ అక్కడే దగ్గరలో ఓ చెట్టు కనిపించింది.

కవిగారు చీదరించుకొని-

"రామ! రామ! పొద్దున్న లేచి యెవరిమొహం చూశానో-అనాకారి వెధవ విరగడయాడనుకుంటే యీ వంకరటింకర దెయ్యపు చెట్టు యెదురయింది నేలకి వొంగిపోతూ యేమిటీ వంకరటింకం చెట్టు, ఎమిటీ బోదె! యెంత లావుగా ఉంది' కస్సుబుస్సు పోగినాగే-

ఇంకా తిట్లు, దీవనలు పూర్తికాలేదు. ఇంతలో దబాగబామని పెద్ద వర్షం కురియడం ప్రారంభించింది. కవిగారు తడిసిపోకుండా పరుగున వెళ్లి ఆ వంకరటింకర చెట్టుకిందబోదె వద్దకే వెళ్ళారు.

కవిని ఆ చెట్టు తనవీడకు రమ్మని పిలుస్తోందా అన్నట్లు ఉంది.

ఆ చెట్టుకింద కవిగారుశరీరం మీద ఒక్కచినుకేనా పడకుండా సురక్షితంగా ఉన్నారు.

టీ అమ్మకునేవాడుకూడ తన సామానుతోసహా పరుగెత్తి అక్కడకే వచ్చాడు చలికి వొణుకుతున్న కవిగారిని చూసి జాలివేసి-తిరుగా తన వేడివేడిటీ అందిచ్చాడు.

చలితో వణుకుతున్న కవిగారు వెనకాముందూ ఆలోచించకుండా ఆ తొరకలతొక్కుటీసే అమృతతుల్యంగా చప్పరించి తాగాడు.

ఇదివరకు తనకి అసహ్యంగా కినపడిన వస్తువులు, తనకు ఎంత ఆధారమయాయో అమృతతుల్యమైన ఆ టీ తాగుతుంటే, కవిగారికి అర్థమయింది. భగవంతునిసృష్టిలోని ప్రతిఅణువూ కవిగారిదృష్టికి కవితావస్తువే!

---



14-వ తేదీనాడు ప్రభుత్వగృహంలో ఉపాహారి[illegible] ఇచ్చిన విందులో అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్.

# చిన్ననాటి చిలిపి జవహర్లాల్

శ్రీమతి పెనుమాక అన్నపూర్ణ



మన ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ అయిదేండ్ల ప్రాయమున అనేక చిలిపిపనులు చేసేవాడు. ఒకరోజున తండ్రి మోతీలాల్ నెహ్రూవద్ద రెండుకలాలు ఉండటం చూచాడు. టేబిలుమీద ఆ రెండు



కలాలు పెట్టిఉన్నాయి. ఒకటి తనకుంటే బాగుంటుం దనుకొన్నాడు. "అయినా మా నాన్నగారు వ్రాయటానికి రెండుకలా లెందుకు" అని ఆలోచించాడు. ఆలోచించి ఒక కలం తీసి దాచాడు. మోతీలాల్ రెండోకలంకోసం యిల్లంతా వెతికించాడు. జవహర్లాల్‌నుకూడ అడిగారు. చెప్పలా. కొంతసేపటికి దొరికింది. జవహర్లాలుమీద కోపమొచ్చి తండ్రి దండించబోయేసరికి తప్పించుకొని తల్లిదగ్గరకు పారిపోయి ఆమెవద్ద దాగుకొన్నాడు.

కాని జవహర్లాల్ తల్లిదండ్రులను అమితంగా ప్రేమిస్తూ వుండేవాడు. తనకుచదువుచెప్పే మున్షీజీని, తాను స్వారిచేసే పొట్టిగుఱ్ఱం-రత్నాని ఎంతో ప్రేమించేవాడు. మున్షీజీ తనకు చెప్పే కథలన్నీ సాయంత్రం స్వారిచేసేటప్పుడు రత్నాతో చెప్పేవాడు. ఒకరోజున మున్షీజీచెప్పిన గారడీగుఱ్ఱంకథ చెప్పతూ "రత్నా, నువ్వుకూడా ఆగుఱ్ఱంలా వాయువేగమనోవేగాలతో పరుగెత్త రాదూ" అన్నాడు, ఆమాటలు వినేటప్పటికల్లా రత్నాకు కోపంవచ్చింది. తనశక్తిసామర్థ్యాలు చూపించాలని వెంటనే దౌడుతీసిందిగాలితో సమానంగా. ఎంతో ఉత్సాహంతో రత్నా పరుగెత్తుతుంటే ఎప్పుడు జారాడో జారిపడిపోయాడు జవహర్లాల్. కాని గట్టిప్రమాదం సంభవించలా రత్నా తనదారిని యింటికి పోయింది. తల్లిదండ్రులు నివ్వెరపోయి వెతికించి తీసికొచ్చారు జవహర్లాల్ని. కాని జవహర్లాల్ రత్నాని ప్రేమతోనే చూచేవాడు.

ఇక పండుగలొచ్చాయంటే అతని సంతోషానికి మేరలేదు ముఖ్యంగా హోళీ,దీపావళీ, పెళ్లిళ్లు పుట్టినరోజుపండుగదినాల్లో మైమరచితోటిబాలురతో గడిపేవాడు. హోళీపండుగరోజున పిచికారీలో వసంతంపోసి, పెద్దవాళ్లమీద కసిదీర కొట్టేవాడు. వాళ్లు తప్పించుకొని తోటలోనికి పరుగెత్తితే, సింహపుపిల్లలా పచకారీతో వెంబడించి వాళ్లగుడ్డలన్నీ రంగునీళ్ళమయం చేసేవాడు దీపావళిరోజున వేలకొలదిదీపాలు వెలిగించి సాటిపిల్లలతో ఎగిరేవాడు. ఏ వూరనా్న ప్రయాణం అని తెలిస్తేచాలు ముందుగానే పరుగెత్తి కార్లోడ్రైవరు ప్రక్కనే కూర్చునేవాడు.

అన్నిటికంటె ముఖ్యంగా తన పుట్టినరోజు ఎప్పుడొస్తుందా అని ఎదురుచూచేవాడు. ఎందుకంటే ఆరోజున అందరు తనకు బ్రహ్మరథం పడతారని. ఆ రోజు నెహ్రూ కుటుంబీకులకు పర్వదినం ఉదయాన్నే తెల్లవారకముందే తల్లి జవహర్ని పెద్దత్రాసులో కూర్చోబెట్టి

# "అబ్బాయిలు"

**ఎలన్ బెక్**

అబ్బాయిలు అనేక సైజులలో, వివిధ వర్ణాలలో, వివిధరూపాలలో తయారై వస్తూఉంటారు. ఎక్కడపడితే అక్కడ-ఇళ్లల్లో గుళ్లల్లో, రోడ్లమీద, పార్కుల్లో పైనా క్రిందా, ఇరుకుల్లో, ఉరుకుల్లో చెట్లమీద, చెట్లక్రింద, ఒకచోటు ఒకమాదిరి, ఒకస్థితిఅంటూ విభేదం లేకుండా అంతటా కనబడుతూంటారు అబ్బాయిలు. అబ్బాయిలంటే అమ్మలకు ప్రేమ. చిన్న అమ్మాయిలకు ద్వేషం. అక్కలూ అన్నలూ సహనంతో చూస్తారు. ఇతర పెద్దలు నిర్లక్ష్యంతో చూస్తారు. భగవంతుడే ఆదరణతో రక్షిస్తూంటాడు. అబ్బాయి అంటే మట్టిలో పులిమిన మాణిక్యం. దుమ్ములో దొర్లించిన "సత్యము" అబ్బాయిలూ విజ్ఞానసిధులు, అయినా మట్టిపెళ్లలే బుట్టనిండా ఇరుక్కుని ఉంటాయి. అబ్బాయిలు, భవిష్యదాశాస్వరూపులు. అయినా వాళ్ల జేబుల్లో కప్పపిల్లలు గంతు లేస్తుంటాయి.

అబ్బాయికున్న ఆకలి అడివిలో క్రోల్పులికికూడా ఉండదు. అబ్బాయి అరిగించుకొన్నట్లు, అగస్త్యుడుకూడా, గాజు, ఇనుము, అరిగించుకోలేడు. అబ్బాయికున్న విప్లవశక్తి ఆటంబాంబుకుకూడా లేదు. అబ్బాయిగొంతుక డిక్టేటర్లకే ఆదర్శము. కొత్తవి తెలుసుకోవాలని అబ్బాయికున్న కుతూహలం గజదొంగకూ, సి.ఐ.డీ పోలీసుకూకూడా ఉండదు. ఊహాశక్తికి ఆదికవి అందడు. అతనికున్న నుసిగ్గు, లేతగులాబీ మొగ్గలకుకూడా ఉండదు. ఏపనైనా చెయ్యమొదలెట్టాడా అంటే, అబ్బాయి చేతిని ఐదువేళ్లూ ఐదుబొటనవ్రేళ్ళే!

అబ్బాయికి అన్నీ ఇష్టమే; ఐస్ క్రీమ్, పిన్నుసూది, పావలాకాసు, రంపాలు, ఉలులు, చేబడితలు, కత్తిరబోనులు, కాలుజారేచెప్పులు, నదులు, కరిచే కుక్కలు పరిగెత్తే మోటార్లు, అన్నీ అతనికి కావాలి. అన్నిటితోటూ నాన్న కావాలి. ఇంట్లో అబ్బాయంత పెందరాళే ఎవరూ లేవరు. అతనితోటి రాత్రి భోజనందాకా మేల్కొనగలిగినవాళ్లూ లేరు.

అబ్బాయి జేబులో ఇమిడినన్ని సరుకులు, విక్రమవినోదిసంచిలో కూడా ఇముడవు. మొండిచాకూ పాత బ్లేడూ, సిగరెట్టుపెట్టెబొమ్మలూ దారపుఉండ, పాత కాసులూ, పగిలిన గోళీలూ సగంతిన్న జామకాయ అరిగిపోయిన ఉలి, ఇంజక్షన్లు కోసే చిన్నరంపమూ, తుమ్మజిగురుదండలు, పిప్పరమెంటు బిళ్ళలూ, నిప్పుపెట్టెకంజీర, విరిగిన హార్మోనియంరీడు, భూగర్భశాస్త్రజ్ఞులు భేదించలేని రాతిముక్కలూ ఒకటేమిటి, ఒక బ్రహ్మాండగోళమంతా ఆ కుక్షినంటిన పైజేబులోనే ఇమిడి ఉంటుంది.

అబ్బాయి ఒక ఇంద్రజాలికుడు. పనిచేసుకొంటూన్న జాగానుంచి అబ్బాయిని అవతలికి తోలేయగలవుగాని నీ మనస్సులోనుంచి ఒక్క క్షణము అవతలికి నెట్టలేవు-ఆ ప్రయత్నమే వృథా. అబ్బాయి నీకు రక్షకుడు. నీకు రక్ష. నీకు యజమాని. అబ్బాయిచేతిలో నీవు ఖైదీవి. బానిసవి. అబ్బాయి గీచిన గీటు దాటటానికి లేదు. మట్టికొట్టుకుపోయిన మొగంతో, ముద్దగట్టిన "అల్లరి"-అబ్బాయి. కాని దినకృత్యాలలో జీవితాన్నెదిరించలేక, నీరవుడవై, నిస్పృహుడవై, కాళ్ళీడ్చుకుంటూ ఇంటికొచ్చేటప్పటికి, కాళ్ళకు చుట్టేసి, మెడచుట్టు రెండు చిన్న చేతులు బిగించి, "నాన్నోయ్!" అన్న ఒక్క సంతోషపు కేకతో, అబ్బాయి అన్నికష్టాలు ఇట్టే తుడిచిపెట్టేసి స్వర్గాని కెత్తేస్తాడు!

(రీడర్స్ డైజెస్టునుండి)

---

పరచి తనదేశానికి పయనం సాగించాడు.

గాంధారదేశం రాజు శూరసింహుడు యీ బ్రాహ్మణుని రాజనీతిజ్ఞప్రవర్తనకి మెచ్చుకుని యితణ్ణే మంత్రిగా చేసుకుని మరల స్వతంత్రుడై యథాపూర్వంగా తన రాజ్యాన్ని ఏ చింతా భయమూ లేక పాలిస్తూండేవాడు. కథ కంచికీ మనమింటికీ.



# పేరులో ఏముంది?

శ్రీ చి. యనమండ్ర రఘుపతి

ఒక్కొక్కప్పుడు మనం చాల బాగున్న పేరెవరిదైనా వింటే ఎంత బాగుందో ఆ పేరు. నాపేరు ఏం బాగులేదు. నే నేదైనా క్రొత్తపేరు పెట్టుకుంటూ నాపేరు మార్చేసుకొని. అని అనుకుంటాం. కాని నిజంగా ఆలోచిస్తే పేరులో ఏముంది ? ప్రతిదీ మనసులోనూ, మనకర్మలోనూ వుంటుంది. పేరు అందంగావుండచ్చు. కాని మంచిబుద్ధులు గలిగి లేక పోవచ్చు. అంతేకాని పేరులో ఏం లేదు. ఆ సంగతి ఎపుడు మరవ కండేం? దీనిగురించి పూర్వం ఒక జరిగినదాన్ని గూర్చి చెప్తాను వినండి:

పూర్వకాలంలో ఒకానొక గురువువద్ద ఎంతోమంది విద్యార్థులు విద్య నేర్చుకుంటూండేవారు. ఆ విద్యార్థులలో ఒకడిపేరు 'పాపం' అంతమందీ అతన్ని పాపం 'పాపం' అని పిలుస్తూండేవారు. వాళ్లలా పిల వడం పాపానికి చాల కష్టం అని పించి ఒకనాడు ఎలాగైనా తనపేరు మార్చేసుకొని మరో మంచిపేరు పెట్టుకుందామని ఆలోచించి గురువు వద్దకు పోయి, గురువుగారూ నాపేరు చాల చెడ్డపేరు. అంచేత పేరు మార్చేసుకొని క్రొత్తపేరుపెట్టుకో డానికి అనుమతి యివ్వండి అని కోరేడు. అపుడు గురువు పాపాన్ని గ్రామగ్రామాలు పట్టణాలు తిరిగి తన కేం పేరు కావాలో అది పెట్టు కొమ్మని చెప్పాడు. గురువుగారు చెప్పిన సలహాకి చాల సంతోషించి 'పాపం' బైలుదేరేడు. తిరిగితిరిగి ఒక పట్టణం చేరుకున్నాడు. అక్కడ ఆరోజు ఎవడో ఒకతను చని పోయేడు. వాని బంధువులు మిత్రులు దహనసంస్కారం చేయుటకు శ్మశా నానికి తీసుకుపోతున్నారు. అది చూచి 'పాపం' వాళ్లని చని పోయినవాడిపే రేమిటని ప్రశ్నిం చేడు. వాళ్లు 'మృత్యుంజయు డని బదులు చెప్పేరు. వాళ్ళజవాబు కాశ్చర్యపడి 'మృత్యుంజయునకు చా వేమిటి? అని అడిగేడు. అంతే వాళ్లు ఓరి వెఱ్ఱివాడా! మృత్యుంజయుడన్నంతమాత్రాన మృత్యువును జయిస్తాడా? ప్రతి వాళ్లకు చావు తప్పదు. ఏదో ఒక్కొక్కమనిషికి ఒక్కొక్క పేరు పెట్టొంటారుకాని పేరులో ఏం లేదు అని అన్నారు.

దానితరువాత వెళ్లి వెళ్లి మరొక పట్నం చేరేడు. అక్కడ ఒక స్త్రీ ప్రతిగుమ్మందగ్గిర ముష్టి అడుక్కోడం చూసి 'పాపం' నీపే రేమిటని ప్రశ్నించేడు. అపుడామె 'ధనం' అని జవాబుచెప్పింది. అది విని పాపానికి ఆశ్చర్యంవేసి 'నీవు ధనంకదా? నీవే ముష్టి ఎందుకెత్తు కుంటున్నావు? అని అన్నాడు. అపుడామె నవ్వి 'పేరైతే ధనం గాని నాకు ధనం ఎలాగు వస్తుంది? పేరుపెట్టుకున్నంతమాత్రంలో మన లో ఏం వుంది? నీవు వట్టి పనికి మాలినవాడివిలా గున్నావే అని అంది. అచటినుండి మరొకవూరు వెళ్ళి ఈవూరురాజుపే రేమని అక్కడడిగేడు. ఆ వూరు ప్రజలు 'పకీరు' అని జవాబిచ్చారు. అపుడు పాపం ఏవిధంగానే పకీరు నకు రాజ్య మేమిటి? అనడగగా వాళ్లు నవ్వి మన పాపాన్ని చాల అగౌరవపరచేరు, యింక తిరిగి గురువువద్దకు పోసాగాడు. మళ్లీ త్రోవలో ఒక ముసలివాడు నడువ లేకనడువలేక వొణుకుతూ వస్తూం డగా మన 'పాపం' ఆ ముసలి వాడ్ని నీపే రేమని ప్రశ్నించగా ఆ వృద్ధుడు 'నాపేరు యవనసింగు' అని చెప్పెను. అది విని పాపానికి చాల నవ్వువచ్చి 'యవ్వనునకు' కూడ ముసలితన మేమిటి అని ప్రశ్నించేడు. అపుడాముసలివాడు ఓరి వెఱ్ఱివాడా పేరుపెట్టుకున్న ప్రకారం మనమలాగ వుంటామా? ముసలితనం అందరికీ సహజం. పేరులో ఎపుడు ఏం లేదు." అని భోధపరచేడు. అపుడు "పాపం" నిజమే. పేరులో ఏం లేదని గ్రహించి తన గురువువద్దకు వెళ్ళి యిలా చెప్పేడు. గురువుగారూ! నే ననేక గ్రామాలు తిరిగేను. ఒక వూళ్లో ఎవరిపేరైతే మృత్యుంజయుడని ఉందో వాడికికూడ చావుంది. మరొకగ్రామంలో ఎవరిపేరైతే "ధనం" అని వుందో ఆమె కూడ ముష్టి ఎత్తుకుంటోంది. మరోవూళ్ళో ఎవడయితే "పకీరని" పేరుపెట్టుకున్నా డో వాడు ప్రజారంజకంగా రాజ్యం చేస్తున్నాడు. మరోవూళ్లో ఎవడు "యవనసింహాని" పేరు పెట్టు కొన్నాడో వాడు వృద్ధాప్యంచేత నడువలేక మూడుకాళ్లతో బాధ పడ్తూ నడుస్తున్నాడు. యిలాగున్నా

విజ్ఞానవిశేషాలు :

# అభినవయక్ష ప్రశ్నలు



'నాగార్జున'

### వృక్షములు ఊర్ధ్వముగ పెరుగున దెందుచేత ?

భూమ్యానువర్తన మను వృక్షముల విశేషగుణమును ప్రాతిపదికగ తీసికొని వృక్షముల కొమ్మలు, మూలముల వలె గాక, భూమి గురుత్వాకర్షణశక్తిని అతిక్రమించి ఊర్ధ్వముగ పెరుగును. ఈ విశేషము థామస్ నైటు, ఆంగ్లవృక్షశాస్త్రవేత్త సేసిన పరిశోధనలను బట్టి దృఢమైనది.

వృక్షములు పెరుగుట యనగా, పరిసర ప్రకృతిశక్తుల ప్రేరణనుబట్టి వృక్షావకణములు ఉత్పత్తి యగుట. ఈ ఉత్పత్తిలో కముసమునకు ఒక్కొక్క వృక్షకణము అనేక కణములుగ విభజింపబడును. పరిసరప్రకృతి శక్తులలో భూమ్యానువర్తనము అనునది ఒకటి. దీనినే ఆంగ్లములో 'జియోట్రాపిజమ్' అందురు. ఈ విశేషగుణమునుగూర్చి వివరములు ఇంకా ఇదమిత్థమని ఎవ్వరికీ తెలియవు.

బాష్పోచ్ఛ్వసన (ట్రాన్స్పిరేషన్) క్రియకు, భూమ్యనువర్తనమునకు ఏదో సన్నిహితసంబంధము ఉన్నట్లు శాస్త్రవేత్తల ఊహ. వృక్షములు భూమినుండి నీటిని గ్రహించును. ఇట్లు పీల్చిన నీరు కొమ్మల సూక్ష్మరంధ్రములద్వారా ఆపరితలమునకు ఎగబ్రాకి-ఆకుల స్థానములద్వారా ఆవిగాక మారును. ఈ క్రియకే బాష్పోచ్ఛ్వసన అని పేరు. ఈ చర్య జరుగునప్పుడు, నీటితో బాటు కొన్ని వృక్షకణములుగూడ పైకి పోవును. ఈ క్రియకు వాతావరణప్రేషము, మూలప్రేషము (రూట్ ప్రెషరు) అమితముగ తోడ్పడునని తెలియవచ్చుచున్నది.

పై వివరించిన కారణములచేత, ఈ వృక్షకణములు ఊర్ధ్వగతప్రయాణముచేసి వృక్షమును భూమిపైకి పెరుగునట్లు చేయును.

ఈ సందర్భములో మన సుప్రసిద్ధ వృక్షశాస్త్రపరిశోధకుడు జగదీశ్ బోసు చేసిన కృషి అపారమనుటలో అతిశయోక్తి ఏమీ లేదు !

### ఆకాశము సాధారణముగ నీలవర్ణములో నుండున దెందుచేత?

మన నేత్రాలకు కనిపించే సూర్యకాంతి ప్రసారము సప్తవర్ణ (ఘాఢనీలము, ఊదా, లేతనీలము, ఆకుపచ్చ, పసుపు, నారింజ, ఎరుపు) సంయుక్తమైనది. కాంతికిరణములు మన వాతావరణముగుండా ప్రయాణము చేయునప్పుడు, వాటిలో కొన్ని కిరణములు సూటిగ వాటి దారిని అడ్డుపోవుచున్న వాయు అణువులతో సంఘాతించును. ఈ కాంతి కిరణ, వాయు అణు పరస్పర సంఘాతములలో కాంతి పరిక్షేపింపబడును. ఇట్లు విచలనమొందిన కాంతియందు హ్రస్వతరంగములు గల నీలవర్ణ కిరణము లధికము లుండును.

సూర్యవికిరణదిశకు నిర్దిష్టకోణములో నున్నప్పుడే ఈ పరిక్షేపకిరణములు (నీలవర్ణ కిరణములు) పరావర్తనము చెందును. ఈ పరావర్తనకిరణసముదాయమే, మనకు నీలవర్ణపు దుప్పటివలె ఆకసమున, ప్రతినిత్యము కానవగును.

ఈ పరిక్షేపవిశేషమునకు 'రామన్ ఫలితము' నకు చాల దగ్గరసంబంధము గలదు.

### తోకచుక్క (కామెట్) అనగా నేమి?

ఆకాశవీధులలో (ప్రక్షేపము) సూర్యుని చుట్టూ పరిభ్రమించు ఒకానొక ఖగోళవిశేషమునకు తోకచుక్క అని పేరు. సామాన్యముగ, ఇవి దీర్ఘవృత్తాకారకక్ష్యలలో ప్రయాణముచేయును. పరవలయాకృతి కక్ష్యలలోకూడ యివి ప్రయాణముచేసినట్లు నిదర్శనము లున్నను - ఇటువంటివి చాల అరుదు. ఇవి నక్షత్రమును (తార) బోలియుండును. 17 వ శతాబ్దముతో 'హేలి' అను జ్యోతిష శాస్త్రవేత్త తోకచుక్కలనగూర్చి అనేక పరిశోధనలు చేసెను. లోగడ, 1456, 1680, 1811, 1843, 1858, 1861, 1874, 1881, 1910, 1948 సంవత్సరములలో కానవచ్చిన తోకచుక్కలు ముఖ్యమైనవి. వాటి రాకను జ్యోతిశ్శాస్త్రవేత్తలు నిపలుగ గణించగలరు.

తోకచుక్కలు అత్యంత పరిమాణము గలవి. ఒక్కొక్కసారి వాటి శీర్షవ్యాసము కొన్నివేల మైళ్లుండును కాని కాంతిమాత్రము తీక్ష్ణముగ వుండదు,

తోకచుక్కలు కనిపించిన, దేశానికి రాజునకు అరిష్టము సంభవించునని మన ప్రాచీనుల నమ్మకము. కాని ఈ నమ్మకానికి అనుగుణంగా నిదర్శనాలేమీ కనుపించుటలేదు.

తోకచుక్కల రాకపోకల హేతువులు, నిర్మాణవివరములు ఇదమిత్థమని నిర్ణయించినట్లు కనిపించుటలేదు. ఆధునికాభిప్రాయము లలో - (1948-49) హార్వర్డు విశ్వవిద్యాలయమునకు చెందిన జ్యోతిశ్శాస్త్రవేత్త ఫ్రెడ్ విపుల్, సుమారు 18మాసములు పరిశోధనలు చేసి వాటి నిర్మాణరహస్యములను కొంతవరకు గ్రహించినట్లు తెలియుచున్నది.

తోకచుక్క కేంద్రనిర్మాణమంతయు మంచుతో మిళితమైన రాతిపదార్థమువలె నుండును. అమ్మోనియా, మిథేను, కర్బన ద్వ్యామ్లజనిదము మంచుతో కలసి పరమ [illegible] ఘనీభవించియున్నట్లు విపుల్ ఊహ. ఈతడు పరిశీలించిన తోకచుక్కల వ్యాసము అనేకమైలు గలవు

ఇంతకును, ఈతడు చేసిన పరిశోధనల ననుసరించి - సూర్యశక్తుల ఆకర్షణవలన దాని

---

యి సంగతులు. అందుచేత పేరులో ఏం లేదు మన కర్మనుబట్టి, మన గుణములుబట్టిగాని, పేరులో ఏం లేదు. అందుచేత నాపేరు మార్చుకొనడంలో అవసరం నాకేమీ కనపడడంలేదని చెప్పేను. అపుడు గురువు నవ్వి "నీకు ఆసంగతి బోధపర్చుకొనుటకే" అలా నిన్ను సంచారము చేయమన్నాను" అనిఅన్నాడు.

యిలాగే ప్రతివాళ్ళూ పేరుపెట్టుకున్న మాత్రంలో ఏం లేదు.

కక్ష్య సూర్యుని చుట్టూ దీర్ఘవృత్తాకారము పొందినది - ఈ కక్ష్యలో పరిభ్రమించుటకు పదివేలుమొదలు - పదిలక్షల సంవత్సరముల కాలవ్యవధి తీసుకొనవచ్చునని విపుల్ అంచనా వేసినాడు. ఈలోపున ఎప్పుడో ఒకప్పుడు దాని కేంద్రము సూర్యగోళమును సమీపించ వచ్చునని ఆయన ఊహ.

చటుక్కున, ఒక్కొక్కసారి, తోక చుక్క కేంద్రము తీక్ష్ణముగ కనిపించును. విపుల్ అభిప్రాయముననుసరించి కేంద్రమునకు ఒకవైపున సూర్యుని వేడిమి అమితమై ఉపరితలమంతా ద్రవీభూతమై ఆవిరిగ మారును. ఒక్కొక్కసారి, ఈ చర్యలు బలముగ జరిగినప్పుడు, ఘనపదార్థకణములు చెల్లాచెదురై పోవును. ఇట్లు ద్రవీభూతమైన, వాయుపదార్థకణములపై సూర్యకిరణములు పడినప్పుడు తోకచుక్క స్వయంప్రకాశమై మెరయుచుండును. ఈకణసంచయమే మనకుతోకవలె గోచరించుచున్నదని విపుల్ అభిప్రాయము.

తోకచుక్కశీర్షము చాల పెద్దదిగావున, సీరప్రసారప్రదేశము దానిని సూటిగా నొక్కినప్పుడు తోక ఏర్పడునని మన పూర్వులు ఊహించినట్లు నిదర్శనము లున్నవి

మనము, ప్రతినిత్యము, ఆకాశములో తారాజువ్వలవలె మెరసి భూమిపైపుకు పడుతూఉన్నట్లు కనిపించే ఉల్కలు, తోకచుక్కలనుండి ఊడిపడే ముక్కలని ఆధునికుల అభిప్రాయము.

## పెన్సిలిన్ దేనినుండి తయారుచేయుదురు?

ఆధునికవైద్యములో 'పెన్సిలిన్' ను సర్వరోగనివారిణిగ ఉపయోగించుచున్నారు.

'పెన్సిలిన్' అను మందు' ఏన్టిబయోటిక్సు, సంబంధించినది. ఏన్టిబయోటిక్సు అనగా సూక్ష్మజీవులు (బేక్టీరియా) అసంఖ్యాకములు గాకుండా ఆపుచేయు వస్తువిశేషము. 'పెన్సిలిన్' చాలవరకు క్రిములను నశింపజేయును. కొన్నింటిని సంఖ్య పెరగకుండ ఆపుచేయును. అందుచేతనే దీనిని బేక్టిరియోస్టేటిక్' అందురు.

'పెన్సిలిన్' పెన్సిలమ్ నోటేటము అను బూజు (మోల్డు) నుండి తయారుచేయుదురు. అనుకూలపరిస్థితులలో ఇది గోధుమరొట్టె (బన్) కు పట్టును. చారిత్రకముగ, ప్రసిద్ధ ఆంగ్లవైద్యుడు డాక్టరు అలెగ్జాండరు ఫ్లెమిలగు (1928 - 29) లో దీనిని కనిపెట్టినాడు. స్టెపిలో కోకస్ బేక్టీరియాతో పరిశోధనలు చేయుచున్నప్పుడు, దాని చుట్టూ కొంత మేర (ఈ పెన్సిలిన్ బూజుపట్టినంత) ఆ బేక్టీరియా నశించియుండుట గ్రహించెను. ఇది ఆధారముగ తీసుకొని కృషిని సాగించి పెన్సిలిన్ మందును సాధించెను.

తరువాత, తీవ్రకృషిపర్యవసానముగ నేడు 'పెన్సిలిన్' ను భారీపద్ధతులపై అవలీలగ తయారుచేయుచున్నారు. దీనిని, బూజు నుండి తయారుచేయుటయే గాక, కృత్రిమముగ అచేతనపదార్థములనుండి గూడ తయారు చేస్తున్నారు.

ఇటీవల చేసిన పరిశోధనాకృషిఫలితముగ 'పెన్సిలిన్' కంటె మిగుల యుపయోగకరమైనటువంటి 'స్ట్రెప్టోమైసిన్', ఆరోమైసిన్ అను మందులు సిద్ధించినవి. హానికరమైన సూక్ష్మజీవులను చంపుటలో, పై రెండుమందులుకూడ పనిజేయును. 'ఆరోమైసిన్' అనునది సుమారు అన్ని వ్యాధులను నివారణ చేయును. శ్వాసజబ్బు (న్యూమోనియా)కు హేతువైన న్యూమోకోకస్ అను సూక్ష్మక్రిములను క్రుటిలో చంపును. ఇట్లే జీర్ణకోశములు వుండే క్రిములను, సుఖవ్యాధి హేతువైన గనోకోకస్, సిఫిలిటిక్ క్రిములను అవలీలగ జంపును. హృదయమునకు వచ్చు వ్యాధులు, రక్తపోటు, క్షయరోగములు నివారణలోను దానికి సాటి యింకొకటి కనిపించదు.

'ఆరోమైసిన్' మందు, మన సుప్రసిద్ధ ఆంధ్రపరిశోధకుడు కీ॥ శే॥ శ్రీ యల్లాప్రగడ సుబ్బారావుగారు చేసిన కృషివలన సిద్ధించినది. ఈయన న్యూయార్కులో వున్న, లీడర్లీ ప్రయోగశాలకు ప్రధానపరిశోధకుడుగ పనిచేస్తూ, యుపయుక్తమైన మందులనేకములు కనిపెట్టి, అమెరికావారి మన్ననలను పొందెను.

'పెన్సిలిన్' జాతిమందులు (పెన్సిలిన్, స్ట్రెప్టోమైసిన్, ఆరోమైసిన్) సూక్ష్మజీవుల వలన కలిగే అంటువ్యాధులనే గాక ఇతరములైన వ్యాధులనుకూడ నివారణచేయును.

ఒకసారి వాడినతరువాత సామాన్య పెన్సిలిన్ రెండవసారి గుణము తక్కువగ కనిపించుచున్నది. దీనికి కారణ మేమనగా, పెన్సిలిన్ ధాటికి కొన్ని క్రిములు అలవాటుపడిచచ్చుట లేదు

---



చెన్నరాష్ట్ర సేవాసమాజం కార్యదర్శిని ఎం. ఎన్. క్లబ్ వాలా గుడివాడవెళ్లినప్పుడు అచ్చటిశాఖవారు ఆమెతో కలసి తీయించుకున్న ఫోటో.

# పంజర విముక్తి

(15 వ పేజీ తరువాయి)

'ఆ పొలం నా పేర వ్రాస్తే బాగుంటుంది... ఎందువల్లనంటే, ప్రభుత్వంవాళ్ళు ఆ ఆస్తిని జప్తు చేయడానికి అవకాశం లేకుండాపోతుందిట! స్త్రీ ధనంజోలికి ప్రభుత్వం రాదట!' అన్నది శకుంతల. నారాయణకు భార్య మాటల్లోని గూఢార్థం బోధపడింది. 'నా పేర వున్న పొలంతాలూకు డబ్బే నేను వాడుకోవడానికి వీలుకానప్పుడు. అది నీ పేర పెడితే – ఇక నాకందులో కానీకూడా ఇవ్వడు మీ నాన్న. నీవు మాట్లాడినమాటలు నీ స్వంతంకావు, మీ నాన్న చెప్పినవి. నా ఆస్తి ఎవరిపేరా రాయను. నేను రాజకీయాల నుండి విరమిస్తే – ఇంకా ప్రభుత్వం నాజోలికెందుకు వస్తుంది?' అన్నాడు నారాయణ.

'మీరు రాజకీయాలను విడిచిపెట్టలేరన్నాడు మా నాన్న! రాజకీయాలలో దిగినవాళ్లు – నాటకాలవాళ్లు – సంగీత పాటకులు – అదొక వ్యసనమై ఇంకోపని చేయలేరని మా నాన్న నమ్మకం. ఆయనకు ప్రపంచానుభవము బాగావుంది!' అన్నది శకుంతల.

'నీ బొంద! నీ మనస్సంతా పాడుచేశాడు. నీలో విప్లవభావాలన్నీ రూపుమాపాడు. నీవు వీరపత్నిగా మాట్లాడటంలేదు. వొట్టి పిరికిపందవైనావు. నా శకుంతల గొప్ప విప్లవభావాలు గలదని నేను జెల్లో స్నేహితులకు కూడా చెప్పాను. నీవుకూడా జయిలుకు వస్తావనుకున్నాను. పెట్టుబడిదారు కూతురివి – నీవు జయిలుకెందుకు వస్తావు? హాయిగా పుట్టింట్లో కూచున్నావు. ఈ మాటలకేంగాని – మీ అమ్మతో చెప్పి ముందు అయిదు వందలివ్వమని చెప్పు. లేదా – పొలం తాకట్టు పెట్టో – అమ్మివేసో డబ్బు తీసుకపోతాను. పొలం నాది!' అన్నాడు నారాయణ ఉద్రేకంతో.

నారాయణ పార్టీలో చేరిన తొలి దినాలలో భార్యనికూడా వెంట తీసుకవెళ్లాలని ప్రయత్నించాడు కాని శకుంతల తండ్రిమీద ఎక్కువ విశ్వాసం కలది కావటంవలన ఆ ప్రయత్నం సాగలేదు. శకుంతల తన భర్తభావాలు తండ్రికి తల్లికి చెప్పింది.

'పిడికప్పెవరిస్తాడు? కొడుకు మైనరు ఆస్తి అమ్మితే ఎవడూ కొనడు. కొడుక్కి సగంపొలం రాసిచ్చి భార్యకుకూడా జీవనోపాధి చూపించి మిగతాదిమాత్రం అమ్ముకోడానికి అతనికి వీలవుతుంది.' అన్నాడు రామసుబ్బయ్య భార్యతో కూతురు శకుంతలతో.

నారాయణ గ్రామంలో అప్పుకోసం కొందరివెంట తిరిగాడు. కాని అతని ప్రవర్తన తెలిసినవారందరూ నిరాకరించారు. అప్పుపుట్టకపోయేసరికి పొలమే అమ్మతానన్నాడు. రామసుబ్బయ్య ప్రాపకంవలన పొలానికి కూడా బేరంరాలేదు. నారాయణకు ప్రతిదినం అప్పల్లెటూరులో ఒకక్షణం యుగంగా గడుస్తోంది. భార్య నగలైనా అడిగి తీసుకుందామనుకుంటే. ఆ నగలన్నీ అమ్మి సొమ్ముచేసుకుని తండ్రివద్ద దాచుకుంది శకుంతల పిల్లవాడిభవిష్యత్తుగూర్చి రామసుబ్బయ్య సలహాతోనే ఆపని జరిగింది. నారాయణ వచ్చి వారం దాటిపోయింది. ఎక్కడా అప్పుపుట్టలేదు. పొలంకొనడానికి ఎవడూ ముందుకురాలేదు. నారాయణ ఆశ్చర్యానికేఅంతులేకపోయింది. ఇక మార్గాంతరంలేక అతను అత్తగారి నడిగాడు. 'మీరైనా చెప్పి మామయ్యచేత నాకో అయిదువందలిప్పించండి. నే నవసరంగా బొంబాయి వెళ్లాలి,' అన్నాడు.

రామసుబ్బయ్యగారు ఆమాటలు విని 'మిగిలిన మూడెకరాలు నీభార్యపేర రాసేస్తే, నీ వివ్వవలసిన వెయ్యిరూపాయల బాకీ రద్దుచేసి, నీవు కావాలంటున్న అయిదువందలు తీసుక పోదువుగాని. దానితో ఆఖరు. ఇక నీవు ఈవూరురావడానికి నీకేం పని వుండదు. నిక్షేపంవంటిభార్య, పిల్లవాడిని విడిచి నీవు దేశసేవచేస్తూ ఆస్తినంతా పాడుచేస్తూంటే ఇక చూచివూరుకోడం నాకు భావ్యం కాదు!' అన్నాడు. నారాయణ డబ్బవసరం వలన పొలం భార్యపేరపెట్టి అయిదువందలు తీసుకోడానికి కృతనిశ్చయుడైనాడు. అతనికి మార్గాంతరం కన్పించలేదు.

ఆ విధంగా నారాయణచేత మూడెకరాల పొలం సర్వహక్కులతో శకుంతలపేర వ్రాయించి రిజిష్టరు చేయించి, వెయ్యిరూపాయల బాకీపోను అయిదువందలు రూపాయలు అల్లునికిచ్చాడు మామగారు. ఆ అయిదు వందలు నారాయణకు 5 లక్షల రూపాయలుగా కనిపించినయి. అతడానందంతో ఆ డబ్బుతీసికొని ఆసాయంత్రం గ్రామం నుంచి బయలుదేరిపోతూ, భార్యతో 'మీ నాన్న బతికుండగా మళ్లీ యీయింట్లో పాదం పెట్టితే ఒట్టు. అరుణకు



400, 741 మంది కాందిశీకులకు ఆశ్రయ మివ్వటానికి అమెరికా నిశ్చయించింది. ఆ శాసనంమీద అధ్యక్షుడు ట్రూమన్ దస్త్రాలు చేస్తున్నారు.

జాగ్రత్తగా పెంచి చక్కగా నడిపించి పెద్దవాణ్ని చేసే బాధ్యత నీకు అప్పగిస్తున్నాను. నేను బ్రతికొంటే మనల కలిసిస్తాను, నేను మరణిస్తే నా కోసం నీ వేమి విచారపడనక్కర లేదు. నా ఆస్తివిషయంలో నీవు నీతండ్రి పక్షాన చేరినా కపకాగము చేసికొంగుకు నేను నిరాకరించను. నే దేశసేవలో మరణిస్తే నాకింకేం కావాలి!' అని దద్దగకంఠంతో అన్నాడు. అత్తా, మామ ఆమాటలు విని పూగకన్నారు. శకుంతల భర్తమాటలువిని అవి అంత్యసందేశంగా భావించి కళ్లనీళ్లు విడిచింది.

నారాయణ కుమారుణ్ణి ముద్దాడి, 'అరుణా! నీవైనా సన్మార్గవర్తనుడివై, ఉద్యోగివై బాగా డబ్బు సంపాదించి మీ అమ్మని సుఖపెట్టు. నేను దుర్మార్గుణ్ని. నా కోసం దిగులుపడకు. మీ అమ్మమ్మ, తాతా నీ జొన్నత్యంకోరి నిన్ను ఉచ్చదశకు తీసుక వస్తారు. నేను మరణించినా నీవు విచారపడ నక్కరలేదు. నీతండ్రి వీరుడై దేశంకోసం తన ప్రాణాలు ధైర్యసాహసాలతో విడిచినట్లుగా జ్ఞాపక ముంచుకో!' అన్నాడు.

ఆ మాటలు వినేసరికి వరలక్షమ్మకు కూడా కంటినీరు స్రవించింది. నారాయణ వెళ్లిపోయాడు. ఆ సంధ్యాసమయారుణకాంతులితన్ని రూక్షవీక్షణాలతో తిలకించాయి.

పదిహేంరోజులు గడిచాయి. ఒకనాడు దినపత్రికలో ఇలా ప్రకటింపబడినది. 'వరంగల్ జిల్లాలో పోలీసులకు కమ్యూనిష్టులకూ సంఘర్షణ జరిగింది. అందులో పోలీసుల కాల్పులవల్ల ఆరుగురు కమ్యూనిష్టులు మరణించారు. గ గురిలో ఇటీవల పార్టీనుంచీ రాజీనామా నిచ్చిన ప్రముఖకమ్యూనిష్టు నారాయణకూడా వున్నాడు!' అని.

ఆ పత్రికాప్రకటన చదివి శకుంతల శోకభారంతో కూలిపోయింది. రామసుబ్బయ్యగారు క్రం ఆశ్చర్యంలో మునిగిపోయి - 'వాడి కథ యిలా విషాదాంత మవుతుందని నాకు తెలుసు. వాడు విడుదలయింది యిందుకోసమే! అమ్మాయీ! నీ వేడవడం అనవసరం! వాడు నామీద కోపంతో తన మనుష్యుల్ని వెంటపెట్టుకుని వచ్చి నన్ను చంపుతాడని నేను భయపడని క్షణంలేదు. వాడు బ్రతికియుండీ, నీకుగాని నీ కొడుక్కుగాని వుపయోగించేదిలేదు. చిన్నప్పటినుంచీ నావద్ద పెరిగినవాడికి చివర రోజుల్లో నామీద గౌరవమే లేకుండాపోయింది!' అన్నాడు.

'తాను చస్తానన్న జ్ఞానంతోనే వెళ్లానికీ కుమారుడికీ ఆఖరి వీడ్కోలిచ్చి మరీ పోయాడు!' అన్నది వరలక్షమ్మ. గ్రామంలో చుట్టా లందరో వచ్చి రామసుబ్బయ్యను, భార్యను, కూతురు శకుంతలను, పరామర్శించి వెళ్లారు. తన భర్త దేశంకోసం మరణించలేదని అజ్ఞానంవల్ల మరణించాడనీ శకుంతలకు తెలుసును. ఆమె తన కుమారుడిని చూచుకుంటూ జీవిస్తోంది.

## అల్లరి పిల్ల

(30-వ పేజీ తరువాయి)

ఇంటికి రాగానే స్కూల్లో వింతలు, విశేషాలు, మేష్టర్ల బోధన ఆటలు, పాటలు–అంతా ఒక్కసారి చెప్పడానికి మొదలుపెట్టి చెప్పలేక ఒక్కొక్కటి జ్ఞాపకంవచ్చి చెప్పే వరకు ఇతర్లను ఓపికతో వినమని, తాను అలసిపోయేది. భోజనం అవడంతడువుగా, నిద్రాదేవత కళ్ల ముందు ఆడ్డంవల్ల, పక్కమీద బోర్లపడుక్కొని నిద్రిస్తుంది. ఇప్పుడు అల్లరి, దుండగాలుచేయడం ఏమిటో మర్చిపోయి ఎవరైనా అల్లరిచేస్తే తాను విసుక్కుంటుంది. ఇంట్లో అందరు విస్తుపోతారు. సుభ ఇలా మారిపోవడం అందరికి ఆశ్చర్యం.



బ్రెసెల్స్‌లో లియోపోల్డు వ్యతిరేక ప్రదర్శనం. ఈ ప్రదర్శనంలో 50 వేల మంది సోషలిస్టులు పాల్గొన్నారు. ఈ ప్రదర్శనకారులు యువరాజుకూ, కీర్తిశేషులైన ఆయన తాతముత్తాతలకు జోహారులర్పిస్తూ వారి చిత్రాలను ఊరేగించారు.

నవల:




శ్రీ నోరి నరసింహశాస్త్రి

## ౪౦

కోప్పెరుంజింగడు కన్నులు తెరచి చూచునప్పటికి తానొక చక్కని పటకుటీరమున సుఖశయ్యపై నున్నట్లు తెలిసికొనెను. ఆతని యిద్దరు రాణులును ఎదుట సుఖాసనములపై నుపవిష్టలై యుండిరి. అతడు తన కన్నులే నమ్మలేకపోయెను.

"నేను ఏలోకములో నున్నాను? వసిష్ఠగోదావరిలో చివర గ్రుటక వేయుచునే పైకి లేచి, ప్రాణములు నిలుపుకొనుటకు అప్రయత్నముగా, అంతవరకు తనతో యుద్ధము చేయుచున్న యాశ్విక యోధుని కంఠమునే ఊతగా కౌగలించుకొంటిని. ఆ యోధు డిప్పు డేమైనాడు? — నే నిప్పుడు వీరస్వర్గములోనే ఉన్నానా? అయ్యో! నీటిలో మునిగి దుర్మరణము పొందిన నాకు వీరస్వర్గము కూడ ప్రాప్తించునా? — కాక నేను కలగుచున్నానా? — లేక జన్నిగతో యుద్ధమును, ఏకాదశీవ్రతమహోత్సవములు, ఊరుభంగ ప్రదర్శనము, కనకసభాపతిపూజాభంగము, అవియే స్వప్నములా? — వీరు నిజముగా నా రాణులే! ఎవరో పుణ్యాత్ములు గోదావరిలో మునిగిపోవుచున్న నన్ను ఒడ్డుకు చేర్చియుందురా? — కాని, — కాని, — కాని, —"

ఈ తలపులన్నియు నాతడు కన్నులు తెరచిన యుత్తరక్షణముననే ఒక్క త్రుటికాలములో ఆతని మనస్సున విద్యుద్వేగముతో ప్రసరించినవి. అతడు కన్నులు తెరచుట చూచి, అంతవరకును మిక్కిలి భయాందోళనములు పడుచున్న యాతని రాణు లిద్దరు లేచి దగ్గరకు వచ్చి ఏమి కావలె నని ప్రశ్నించిరి.

తన కేమి కావలెను? మిక్కిలి నీరసముగా నున్నాడు. ఆతని కా క్రిందటిదిన మెల్ల నాహారము లేదు. ఆపైన గాఢపరిశ్రమతో నలసిపోయెను. నోటివెంట మాటకూడ వచ్చుట లేదు. కాని ఆతని మనస్సుమాత్రము చక్కగ పనిచేయుచున్నది. అప్పటికి సూర్యోదయమై చాలాసేపయిన ట్లున్నది. ద్వాదశిపారణకు వేళ యతిక్రమించుచున్న దని యాతనికి తోచినది. కనకసభాపతి ప్రసాద మాతడు ఇప్పుడు పారణచేయవలె. అతికష్టముమీద నాతడు నోరు పెకల్చుకొని 'ప్రసాదము' అనగలిగెను.

వెంటనే ఆతని రాణులు ఇద్దరు నాతనిచే ముఖశౌచము చేయించి, పాణిపాదములు జలముతో తుడిచి అద్ది, ముఖమున విభూతిరేఖలు తీర్చి, ఒక కొమ్ముచెంబుతో గోక్షీరము నాతని యంగిట నుంచిరి. దానితో నాతనికి కొంచెము సత్తువ వచ్చినది.

మరుక్షణమున నాతనికి సర్వము నవగతమైనది. ఆతని రాణులు తనయందు ఎంత ప్రేమగలవారైనను, స్వయముగా నెన్నడు నుపచారములు చేసినవారు కారు. అన్నియు దాసదాసీజనములచేతనే చేయించువారు. అట్టివా రీనాడు ఉపచారములు చేసిరి. ఆ చేసినవి స్వల్పమైనవే అయినను వా రవి సరిగా చేయుట చేతకాక చేసిరి. వారు పనిచేయుట నేర్చినవారు కారు. తాను తన పత్నులతో కూడ శత్రువుల చేజిక్కినమాట ధ్రువము. అయితే ఆ శత్రువు అంతఃపురగౌరవము దూషించు దుర్మార్గుడు మాత్రము కాదు!

విషయము తెలిసిపోయినది. ఇక తన పరాజయవార్త ప్రత్యక్షముగా అడిగి తెలిసికొను టేల? అందు కాతనికి ధైర్యము చాల లేదు. అంతలో నాతడు త్రావిన పాలవలన వచ్చిన శక్తితోపాటు ఆతని కొక విధమగు మత్తును వచ్చినది. మరల నాతడు కన్నులు మూసెను. మరల రాణులు భయవిహ్వలలై యాతని కనిపెట్టి యుండిరి.

* * * *

కొంచెము స్వాస్థ్యతగా అసమయముననే, కోప్పెరుంజింగనితో జలయుద్ధము చేసిన అశ్వికయోధుడును మరియొక పటకుటీరమున శయ్యపై పవ్వళించియుండి కన్నులు తెరచెను. ఆ పటకుటీరము చిత్రవర్ణపటచిత్రితమై సర్వవిధముల కళకళలాడుచుండెను. నలువురు పరిచారకులు దీనమైన చూపులతో ఆతని కెప్పుడు స్మృతివచ్చునో యని వ్యగ్రులై నిరీక్షించుచుండిరి. అతడు కన్నులు తెరచినదే తడవుగా వారు సూత్స్రముగా నాతనికి ముఖశౌచము చేయించి, తేనెతో కలిపిన గోక్షీరము త్రావించిరి. అతడు తన పరిచారకులను గుర్తించినంతనే, తన్ను గోదావరిలో మునిగిపోవుచుండ తన మిత్రు లుద్ధరించిరని తెలిసికొనెను.

అంతలో తాను గోదావరిలో మునిగిపోవుచు చివరిక్షణమున అప్రయత్నముగ తన శత్రువగు కోప్పెరుంజింగని కంఠాశ్లేషము చేసికొన్నమాట ఆతని మనస్సున నిప్పుడు స్ఫురించినది. ఆ యోధుని కా తలపుతో పెదవులపై చిరునవ్వు చిందులాడెను. అది చూచి

యాతని పరిజనుల ముఖములను విప్పారినవి. ఆ యోధుడు మరల కన్నులు మూసెను.

*　　*　　*　　*

ఈ వార్త శీఘ్రమే పరిజనులు జన్నిగకు తెలియజేసిరి. ఆ యోధు లిద్దరు నిప్పు డున్నది వాసిష్ఠగోదావరికి తూర్పు తీరముననే. మొత్తముమీద కొప్పెరుంజింగడు సిద్ధసంకల్పుడే యనవలెను. అతడు రెండు రణరంగములలో సంపూర్ణముగా పరాభూతు డయ్యెను. ఐననేమి? అతి డింనాడు వసిష్ఠగోదావరిని తరింప సంకల్పించినాడు. ద్వాదశగడియలు రాగానే అతడు నిజముగా గోదావరీ తరణము చేసినాడు. ఎట్లైననేమి! నదిలో మునిగి ప్రాణావశిష్టుడై యుండు నాతడావలియొడ్డు కా రాత్రియే చేర్చబడి యుండెను.

ఆ యోధులున్న ప్రదేశము ఆ క్రిందటిదినమున నిర్జనముగా నుండెను. ఆ సమీపమున చేపలుపట్టి జీవించు కైవర్తుల పల్లెపాలెములు తప్ప మరేమియు లేవు. ఇప్పు డక్కడ పటకుటీరములతో నొక మహాపట్టణమే తీరియున్నది. అదియు నొక పద్మాకారమున నున్నది. పద్మవ్యూహ మన నిట్లే యుండబోలు! ఆ శిబిర మంతటను వరాహధ్వజములు మెరయుచు ఉల్లాసముతో చిరుగాలి కెగురులాడుచున్నవి. ఆ పద్మాకారస్కంధావారమున కర్ణికాస్థానములో విశాలమై మనోజ్ఞచిత్రపటచిత్రితమై చీనాంశుకవినిర్మితమగు నొక పటమందిర మున్నది. అందులో నిప్పుడు శ్రీరుద్రదేవమహారాజు కొలువుండెను. శ్రీ రుద్రదేవమహారాజే! అవును శ్రీరుద్రదేవమహారాజే! శ్రీ రుద్రదేవమహారాజునకే ఆ పద్మవ్యూహమం దెల్లెడ జయజయనినాదములు చెలరేగుచుండెను.

అప్పు డక్కడికి శ్రీరుద్రదేవమహారాజులు వేంచేసియుండుట జన్నిగదేవునకే ఆశ్చర్య మైనది. వారు వత్తురను వార్త యాతనికి రాలేదు. "మహారాజు లెంత సాహసము చేసిరి! ఈవల రెండు మహాయుద్ధములు గెలుపోటములతో సాగుచున్న సమయముననే మహారాజులు స్వయముగా ఆ రణరంగముల కంత సమీపభూమిలోనికి వచ్చుట ఎంత ప్రమాదకరము! ఆ యుద్ధములలో ఓటమి సంభవించి యుండినచో మహారాజుల కెట్టి యపాయము దాపురించి యుండెడిదో కదా! అయితే శ్రీశైలమల్లికార్జునుని ప్రసాదముచే సర్వము ననుకూలమైనది. శ్రీగిరికి యాత్రచేయు భక్తులకు అనువుగా సోపానములు కట్టింతును!" ఇట్లు జన్నిగ తలంచి మ్రొక్కుకొనెను.

శ్రీరుద్రదేవమహారాజులు దక్షవాటిభీమేశ్వరుని దర్శించి ఎంతకాలమో ఐనది. వివాహమైన క్రొత్తలో వీరభద్రేశ్వరునితో గలసి యామె యా మహాలింగమును దర్శించి యుండెను. ఆపిమ్మట కొద్ది కాలమునకే ఆమెగర్భమున ముమ్మడమ్మ పడెను. ఇప్పు డామెకు తన్ను వీరభద్రేశ్వరులు చేసిన మోసమే యా దేవునకు నివేదింప నిచ్ఛ జనించెనో, కాక ఆ గోదావరీవారిపరిపూతములైన యా ప్రాంతపు పుణ్యక్షేత్రములు దర్శించి రావలె ననుకాంక్ష జనించెనో! కుబ్జవిష్ణువర్ధనచాళుక్యుడు వేంగిరాజ్యమునకు స్వతంత్రప్రభువైన కాలమునకు కొంచెము తర్వాతికాలమునుండియే ఆంధ్రరాజులకు దాక్షారామభీమేశ్వరుడు కులదైవ మైనాడు. ఆంధ్రరాజ్యము పరిపాలించువారును, ఆంధ్రరాజ్యము జయింప దలచిన యన్యరాజులును తమ దృష్టి భీమేశ్వరునిపై సారించుచుండిరి. ఆంధ్రయాత్రారాజ్యమునకు నూతనముగా నభిషిక్తమైన శ్రీరుద్రదేవమహారాజులకును నందుచే భీమేశ్వరుని సేవింపవలె నను

సంకల్పము కలిగినదేమో! ఏమైననేమి! ఆమె గణపతిదేవుల యనుజ్ఞయు నాశీర్వచనమును పొంది బయలుదేరినది. అట్లు కదలుటకు ముందు ఆమె రుయ్యమ్మకు విశేషాధికారము లిచ్చి యిటు కదలినది. దాని ఫలితముల నామె దూర మాలోచించినట్లు తోచదు.

జన్నిగసేనలు కొప్పెరుంజింగని సేనలను తాకి యుద్ధము చేయునప్పుడే రాజమహేంద్రవరమునుండి యైదువందల నావలతో నొక సైన్యము వచ్చుటకు నిర్ణితమైనది గదా! ఆ నావలకును సేనకును శ్రీరుద్రదేవమహారాజే యాధిపత్యము వహించెను. ఏకాదశినాడు పగలెల్ల ఆ నావ లన్నియు నరసాపురమునకు కొంచెము ఎగువను గల గోదావరిమలుపులో దాగుకొని యుండెను. సాధారణముగా నాదారిన వచ్చుచు బోవుచుండు నావల రాకపోకలను వారా వెంటనే కట్టువడజేసిరి. ఆవల యుద్ధము సాగుచున్నందున వాని రాకపోకలు కట్టువడుట ఎట్టి సంశయమును కలిగింపలేదు. మహారాజులతో నిన్ని నావలు తమ కింత సమీపమునకు వచ్చియున్న వార్త రహస్యముగా నుండిపోయెను; అది కాడవసేనలకు పొక్కలేదు. ఎప్పటికప్పుడు యుద్ధగతిమాత్రము శ్రీరుద్రదేవమహారాజులకు తెలియవచ్చుచున్నది.

ఏకాదశినాడు సూర్యాస్తమయ మగుచుండగా నా దాగిన నావ లొక్కసారిగా నరసాపురమువైపుకు బయలుదేరినవి. సరిగా వానికి వాయుసంచార మనుకూలముగా నున్నది.

వానితోపాటుగనే, అంబదేవుడు పంపియుండిన పదివేల యాశ్వికదళ మొకటికూడ, సంకేతితప్రకారము భూమిమీద బయలుదేరినది. ఈదళము ముఖ్యముగా మూడుపనులు నిర్వర్తింపవలసి యుండెను. జన్నిగసేనలు దిక్కులో నున్న వానికి సహాయమగుటకు మూలబలమువలె నుండవలెను! జన్నిగసేనలు జయించుచున్నచో పారిపోవుచున్న శత్రుబలములను అరికట్టి దిగ్బంధము చేయవలెను! మరియు ప్రక్కను నదిపై వచ్చుచున్న నావలను అంచలి సేనలను తోడునీడగా నుండి కనిపెట్టుచు, వానికి సర్వసహాయములు చేయవలెను.

కొప్పెరుంజింగడు తన సేనలను గోదావరి దాటించుటకై బలవంతముగా నైదువందల తరులను సేకరించి నరసాపురము రేవున నిలిపియుండెను గదా! చీకటిపడునప్పటికి ఆ నదీతరులను వానికి కాపున్న సేనలను ఆకస్మికముగా రుద్రమనౌకలును, నేలపై వచ్చుచున్న అశ్వికదళమును కలసి ఒక్కసారి చుట్టుముట్టెను. రక్షకభటు లందరు నరకివేయబడిరి. ఆ నదీతరులు నడపువారు యుద్ధవీరులు కారు. వారు నదిపై నిద్దరినుండి యద్దరికి మనుష్యులను దాటించు పేదపల్లెకారులు. వారిని ఎవరు భయపెట్టిన వారికి వినయవిధేయతలు చూపి దాసులగు భీరువులు. కాడవసేనలకు పూర్వము భయపడి యక్కడికి వచ్చియుండిరి. ఇప్పుడు రుద్రమసేనలను చూచి వానికి లొంగిపోయి వాని యాజ్ఞలకు బద్ధులైరి. పగలెల్ల కాకతీయనదీనౌకలు దాగియున్న మలుపులోనికి ఇప్పు డవి యన్నియు తరలింపబడెను. ఈ పను లన్నియు జరుగుటకు రెండు గడియలుకూడ బట్టలేదు.

అవల జన్నిగసేనలు జయోన్ముఖముగా నున్నవి. కాడవసేనలు సేకరించిన తరు లన్నియు రుద్రమవశమైవి. ఒక భయము లేదు. ఆ ధైర్యముతో నా యాశ్వికదళము సాహసించి కొప్పెరుం

జింగడు పూజాదికములు నిర్వర్తించుచున్న శిబిరమునే దురుసుగా తాకెను.

ఆకాలమున పుష్యమాసచంద్రుడు వెన్నెలలు కాయుచు చలిగాలిని మరింత చలువచేయుచున్నాడు. యుద్ధపరిశ్రమలతో నున్న యా యాశ్వికదళమున కది సుఖమే కలిగించుచుండెను.

అట్లు వచ్చిన యాశ్వికదళముల కధిపతియే శిబిరమును పట్టుకొని, కొప్పెరుంజింగని వాసిష్ఠగోదావరిలోనికి వెంబడించి యుద్ధముచేయుచు నాతనితోపాటు గోదావరిలోనికి కొట్టుకొనిపోయెను. అది యుపలక్షించిన యా యోధుని పరివారము ఏనుగుల సహాయముతో ఆ వీరుల నిద్దరిని కొనయూపిరితో నుండ నీటిలో నుండి పైకి లాగి చికిత్సలు చేయించిరి.

వారిని తీసి వారి ముక్కులయొద్ద వ్రేళ్లుపెట్టి చూడగా శ్వాస లాడుటలేదు; వారి రొమ్ములుగాని ప్రక్కలుగాని ఏమాత్రము నెగురుటలేదు. వారు సామాన్యభటులైనచో సంతటితో నాళులు వదలి చనిపోయిరని విడిచిపెట్టి యుండెడివారే. కాని వారు సామాన్యులా? ఒకడు సాహిత్యరత్నాకరుడు, భరతమల్లుడు, ఖడ్గమల్లుడు, నిశ్శంకమల్లుడు, వాల్ బలప్పెరుమాళ్, సాక్షాత్తు రాజసింహుడే! మరి రెండవయోధు డెవరో? అతని పే రెవరు నెరిగినట్లు లేదు. అతడు ఎక్కిన గుర్రపురంగును బట్టి 'పాలయోధు'డని పేరుపడినాడు. ఆ గుర్రము నిగనిగలాడెడి పాలరంగు గలది. అది మాటలాడలేకున్నను మనుష్యులకున్న బుద్ధిబలము ఉన్నదానివలె నున్నది!

సేనావైద్యులు వచ్చిరి. నాడి చూచిరి. నాడు లేమాత్రము కదలుట లేదు. చలికి వారి దేహములు బిగిసికొనిపోయినవి. ఇట్లున్న యా దేహములకుగూడ మృత్యులక్షణమైన చలువ—నీరుకారుచున్నట్లుండు నసహ్యకర మగు చలువ—యావేశింపలేదు. దానితో వారికి కొంచెమాశ కలిగినది. వెంటనే వారు ఆ శవాకృతుల కాలు చేతులు పైకి క్రిందికి నెమ్మదిగా నొత్తసాగిరి. దానితో వారి కుక్షులలో పేరుకొన్న గోదావరినీరు నెమ్మదిగా బయటికి రాసాగెను. కొంతసేపు పట్లు సాధనచేయగా, నాడు లాడుచున్నట్లు తోచెను. పిమ్మట రొమ్ము ప్రక్కలు లేచి పడసాగెను. ముక్కునొద్ద శ్వాస యాడుచున్నట్లు గుర్తు తగిలెను.

ఆ వెంటనే వైద్యులు వారి దేహములు వెచ్చగా నుండునట్లు చేసి, రెండు ప్రత్యేకపటకుటీరములకు చేర్పించి యుండిరి. జన్నిగ కా వార్తలు తెలిసి స్వయముగా వచ్చి వారి నిద్దరను భద్రపరచు నేర్పాటులన్నియు జేయించి, మిగిలియున్న రణకార్యములు నిర్వర్తింప బోయెను. యుద్ధము గెలిచినపిమ్మట చేయవలసిన పనులు యుద్ధాత్పూర్వము చేయు సన్నాహములనుగూడ నొకవిధముగా మించియుండును. తెల్లవారువరకు జన్నిగ యా పనులయందే నిమగ్నుడై యుండెను. తెల్లవారినతర్వాతనే గాని, జన్నిగకు శ్రీ రుద్రదేవమహారాజులే స్వయముగా నదీనావలతో వచ్చినట్లు తెలియలేదు.

కొప్పెరుంజింగని సేనలో ఆనాడు యుద్ధహతులైనవారే ముప్పదివేలమంది వీరు లుండిరి. మిగిలినసేనలో పారిపోగలిగినవారు బహుస్వల్పసంఖ్యాకులు. ఆ సేనలు కొప్పెరుంజింగని యొక్కల ప్రకారము వాసిష్ఠగోదావరి నంటి యుత్తరదిక్కుగా పరుగిడిపోవుట సాధ్యపడలేదు. ఒక కొంత పైపున జన్నిగసేనలును, మిగిలిన భాగమున 'పాలవిరుని'సేనలును వారి నవరోధించెను. ఆ సేనల నాయకులకు కొప్పెరుంజింగని యంతఃపురజనముకూడ శత్రువశమైన దని తెలిసినది. దానితో వారికి ధైర్యము సడలినది. కొప్పెరుంజింగడే సంకేతప్రకారము గోదావరి దాటలేకపోయెననియు ఆ కాడవసేనానులకు తెలిసినది. కొప్పెరుంజింగదేవుడు పూజామధ్యమున అడావిడిగా లేచి గజముపై వసిష్ఠగోదావరి దాటుట కుంకించినట్లు వారికి తెలియవచ్చినది. ఈ స్థితిగతులలో తమ ప్రభువు సురక్షితముగా నుండుట యసాధ్యము. కాడవసేనానులకు నిస్పృహ యావేశించెను. ఎదిరించి లాభములేదు. అందులో కాని దూర దేశము వారు ముప్పదివేలసేనతో జన్నిగకు లొంగిపోయి శస్త్రములు విసర్జించిరి.

యోధులు కాక, ఆ సేనతో పరిచారకులుగను, వినోదకులుగను, కవులుగను, పండితులుగను, నటులుగను, ఋత్విక్కులుగను ముప్పదివేలమంది వచ్చియుండిరి. వారును నిస్సహులై యందరు లొంగిపోయిరి.

ఇంతటిసేనను నిరాయుధమొనర్చుట సామాన్యపు పని కాదు. అయితే ఒక దిక్కున వసిష్ఠగోదావరీప్రవాహముండుటచే కాకతీయ సేనలకు నాలవవంతు పని తగ్గెను. మిగిలిన మూడు దిక్కులే ప్రధానముగా కాపు కాయవలసియుండెను.

* * * *

ఇప్పుడు శ్రీ రుద్రదేవమహారాజులు పేరోలగమునండి ముందు జన్నిగదేవునివలన యుద్ధక్రమమునివేదిక యాలకించిరి. ఆ నివేదికతోపాటు అతడు విజయదశమినాడు పొందిరజమ్మితో కొప్పెరుంజింగనామాంకితపత్రముకూడ మహారాజులకు సమర్పించవలసెను.

ఆపిమ్మట కోరంగినావ వృత్తాంతము నాం కాయుద్ధవిక్రమములు నివేదించుకొనెను. చోళనావలు సర్వనాశనమైనవి. నౌకలు ఒకముప్పది మాత్రము తప్పించుకొనినవి, గాని యవిగూడ యుద్ధమునుచేయు నాంధ్రవీరములకు మరల జన్మకు రావు.

అంతట శ్రీ రుద్రదేవమహారాజు ఆ యుద్ధములలో ధైర్యసాహసములు ప్రదర్శించి ఆంధ్రప్రభువుకు విజయము కూర్చిన యోధుల కెల్లరకు విరివిగా బహుమానములు పంచిపెట్టె.

ఆ సాయంత్రమునకు రెండే పనులు మిగిలిపోయెను. కొప్పెరుంజింగని పిలిపించి యాతని శిక్షించుట, ఒక నాటిని శిబిరము పట్టుకొని, గజముతో గోదావరిలో చొరబారిన కొప్పెరుంజింగని తన యశ్వముతో గోదావరీజలములోనికి వెంటనంటి, సాహసముతో జలయుద్ధ మొనర్చిన యాశ్వికయోధుని బహూకరింపవలెను. అతని పేరు తెలియలేదు. అతడు తెరలను చుట్టుముట్టుటలోను శిబిరము భేదించుటలోనను చూపిన నేర్పు అమోఘము! కాని కొప్పెరుంజింగని గాని, యా యాశ్వికయోధుని గాని, మహారాజులముందు పెట్టుట కింకను యోగ్యమైన స్థితిలో వా రిద్దరును లేరు. ఇద్దరికిని ప్రాణాపాయము తప్పిపోలేదు.

ఆ యాశ్వికయోధుడు ఎక్కిన పాలగుర్రమునుగూర్చి పరిజనము లెన్నియో విశేషములు చెప్పిరి. దాని రంగు, దాని తీరు, దాని నీవి, దాని సులక్షణములు నెన్నియైన వారు వర్ణించిరి. అంతే కాదు! ఆ మహాప్రవాహములలో తనమీదనుండి యోధుడు, పడిపోయినను అది యొడ్డునకు పారిపోయి రాలేదు. పెద్దగా హేషచేయుచు నీటిలో మునిగిపోవుచున్న తన ప్రభువుచుట్టు నది ప్రదక్షిణ మొనర్చుచుండెనట! దాని హేషాశబ్దమును వినియే పరిజనములు, ఆ

సవిూపమునకు వచ్చి యీ గొంధుల నిద్దర నీటిలోనుండి యుద్ధరించిరి. ఆ యాశ్వికుని తీరమునకు చేర్చుచుండ నదియు తీరము చేరెను. అప్పటి కదియు సొమ్మసిలిన ట్లయ్యెను. తెల్లవారినతర్వాత నది తేరుకొనినది గాని, లాయములో నిలుచుట లేదు. తన ప్రభువును చూపింపమని కోరుచున్నది కాబోలు! పరిజనులు కాయపగాష్ణామువరకు నా యూహ తట్టలేదు. అప్పుడు దానిని యజమానుని గుడారముముందు నిలునబెట్టి నిద్రించుచున్న యాతని జూపించిరి. దాని కాతడు జీవించియున్నట్లు నిశ్చయము కాలేదు. హేష చేయదు. మేత ముట్టుట లేదు. ఆ గుడారమునొద్దనుండి ఎంత లాగినను అది కదలుటలేదు. దాని నచ్చటనే వదలిరి. దాని దిగులు చూచినవారికి కన్నుల నీరు వచ్చుచున్నది.

ఈ వృత్తాంతము వినినంతనే శ్రీ రుద్రదేవమహారాజులు ఆ యాజానేయమును చూడవలె నని కోరిక కలిగినదని సెలవిచ్చిరి. భూసురాశీర్వాదములతో నంతట నా సభ ముగిసెను. శ్రీ రుద్రదేవ మహారాజు సపరివారముగా నా యోధుని పటకుటీరమునొద్దకు బయలుదేరెను. కొందరు బ్రాహ్మణులుకూడ వెంట నంటిరి. అందులో వెల్లిగాలను నగ్రహారమున కగ్రణి యగు కేతన యను ఛాందసకవియు బయలుదేరెను.

ఆ యశ్వము మహారాజుల రాక చూడగనే వినయవిధేయతలు కనబరచెను. దాని ముఖభంగి చూడగా రుద్రమకు తనతో నది మాటలాడుచున్నట్లే పొడకట్టెను. పరిజనులు చెప్పినదానికంటె ప్రత్యక్షముగా చూడగా నా యశ్వచర్య లామెకు అద్భుతములుగా కనిపించెను.

చేరిన బ్రాహ్మణులు చెప్పిరి. 'మహారాజా, ఇది పూర్వజన్మలో నా యోధునికి ఆప్తమిత్రమై యుండవలెను. దీనికి తాను పూర్వజన్మమున మనుష్యుడనై యుంటి నను జ్ఞానముకూడ ఉండి యుండవలెను!'

శ్రీ రుద్రదేవమహారాజులు చిరునవ్వు నవ్వుచు నందరను ప్రశ్నించిరి.

"ఇట్టి యశ్వమునకు పూర్వచరిత్ర యుండవలెను. అది ఎరిగినవా రొక్కరును ఇక్కడ లేరా?"

వెల్లిగాలను నగ్రహారమున కగ్రణి మహారాజుల నాశీర్వదించి మాట్లాడెను.

'మహారాజా, ఈ యశ్వము సర్వవిధముల విశిష్టమైనది. ఇది నిర్వచనోత్తరరామాయణమున గ్రంథస్థమైన యశ్వము!'

"ఎట్లెట్లు?"

కేతన మారాడక యీ పద్యము వినిపించెను. అత డాపద్యము చదువుచుండగా వేదసూక్తము చదువుచున్నట్లే రుద్రమకు తోచెను. ఏమి యీ కంఠస్వర చిత్రి!

"శృంగారంబు నలంగదేమియును ప్ర
స్వేదాంకురశ్రేణి లే,
దంగంబుల్ మెలు గేద వించుకయు, మా
హోగ్రాప్తిసామంతుసా
రంగుం గోలి తురంగముం గొనిన సం
గ్రామంబునం దృప్తస
ప్తాంగస్ఫారయుతుండు మన్మవిభుపం
పై చన్న సైన్యంబునన్."

పద్యము పూర్తి యయ్యెను. ఒక్కసారిగా శ్రీరుద్రదేవమహారాజులో మార్పు వచ్చెను. మహారాజు సంతోషించినట్లు లేదు! ఆ యశ్వము నాపై పరీక్షింప లేదు. పటకుటీరమున ప్రమాదావస్థలో నున్న యాయోధుని బరామర్శింపలేదు. ఆ కావ్యకర్త యెవరని యైన నడుగలేదు.

సపరివారముగా శ్రీ రుద్రదేవమహారాజులు గ్రక్కున తమ శిబిరమునకు తిరిగి వెడలిపోయిరి.

---

# మన దేశం

(7 వ పేజీ తరువాయి)

చాలో ఏవి ముందో ఏవి వెనకో జాబితా తయారుచేసింది. ఈ ప్రకారంరక్షణసుంకాలు విధించి ఈ సుంకాలవల్ల వచ్చే ఆదాయంలో కొంత భాగంలో ఒక నిధి నెలకొల్పి పరిశ్రమల సహాయార్థం వినియోగించాలనికూడా సూచించారు.

ప్రభుత్వం ఆధ్వర్యంక్రింద నిర్వహించే వ్యాపారాలనిమిత్తం పోలీసు రెవిన్యూ శాఖల్లో గు దిరిగానే ఆర్థికశాఖ నొకటి ఏర్పాటుచేసి ఉద్యోగుల్ని నియమించాలని సూచించారు.

పారిశ్రామికంగా వెనకబడిన దేశాలకు ప్రభుత్వం అంగీకరించవచ్చునని కమిషన్ నివేదించింది. అయితే అమెరికా బ్రిటన్ కూడా చేరే పక్షంలోనే భారతదేశంకూడా చేరాలి. వివిధ దేశాలమధ్య వ్యాపారాన్ని వృద్ధిచెయ్యడంకోసం రక్షణసుంకాల్ని ఎగుమతి దిగుమతి వ్యాపారనిర్బంధాల్ని కొన్ని ప్రత్యేకసౌకర్యా లేర్పాటైనందువల్ల హవానావ్యాపారపు టొడంబడికను భారత తగ్గించడానికి హవానాఒడంబడిక తయారయింది, బ్రిటన్‌తో భారతదేశం వ్యాపారపు టొడంబడికనికూడా సవరణచెయ్యాలని కమిషన్ సూచించింది. ఫిస్కల్ కమిషన్ నివేదిక వాస్తవికదృక్పథంతో తయారు చెయ్యబడిందనీ, భారత ప్రభుత్వ ప్లానింగ్‌కమిషన్‌కి ఉపయుక్తం కాగలదనీ దేశంలో చాలమంది భావిస్తున్నారు. వ్యాపారులు, పారిశ్రామికులు, కాంగ్రెస్‌నాయకులు, సోషలిస్టులు అందరూ నివేదికను ప్రశంసించారు. ప్రభుత్వం కమిషన్ సూచనల్ని ఆమోదించే ధోరణిలో ఉన్నట్లు కనిపిస్తుంది.

[సీతారామ్]

---

# షూమన్ ప్రణాళిక

(19-వ పేజీ తరువాయి)

## తక్షణ కార్యక్రమం *

ప్రస్తుతం ఉత్పత్తి విధానం, ధరలు, నాణ్యం, అమ్మకం, ఎగుమతుల షరతులు, కార్మికజీవనప్రమాణాలలో ఫ్రాన్సు జర్మనీ దేశాల్లో చాలా వ్యత్యాసాలున్నాయి.

ఈ వ్యత్యాసాలు పోగొట్టి ముందుగా ఒకే స్థితికి తీసుకురావడానికి షూమన్ ఒక కార్యవిధానం సూచించాడు. ఉత్పత్తి విధానం, పరిశ్రమలకి పెట్టుబడి పెట్టేపద్ధతి రెండుదేశాల్లోనూ ఒక నిర్ణీతకార్యక్రమం ప్రకారం నడపడానికి కార్యక్రమాన్ని నిర్ణయించాలి. ధరల్ని రెండు దేశాల్లోనూ ఒకే ప్రమాణానికి తీసుకురావడంవల్ల ఎవరికి నష్టం కలుగుతుందో వారికి నష్టపరిహారం ఇచ్చేపద్ధతి ఒకదాన్ని నిర్ణయించాలి. ఉత్పత్తివిధానాన్ని సంస్కరించడానికి యంత్రపరికరాల్ని మార్చాలి. దీనికి ఒక నిధి నెలకొల్పి ఒక కార్యక్రమాన్ని నిర్ణయించాలి. తద్వారా ఉత్పత్తిఖర్చుల్ని తగ్గించాలి. ఉభయదేశాలమధ్య బొగ్గు ఉక్కుల రవానాపైన నిర్బంధాల్ని తొలగించి రవానా సుంకాల్ని రద్దుపరచాలి. రవానా ఖర్చుల్ని ఒకే ప్రమాణానికి తీసుకురావాలి. ఉత్తరోత్తరా ఆయా ప్రాంతాల అవసరాల్ని బట్టి ఉక్కు బొగ్గుల రవానా కార్యక్రమాన్ని నిర్ణయిస్తారు.

ఈ కార్యవిధానంవల్ల పరిశ్రమల యాజమాన్యపు హక్కులలో మార్పులు రానవసరం లేదనీ, రూర్ పరిశ్రమలపై విధించబడిన అంతర్జాతీయఅధికారసంస్థని వెంటనే రద్దు పరచవలసిన అవసరం ఉండదనీ షూమన్ అన్నాడు.

ఈ ప్రణాళికని వెంటనే అమెరికా హర్షించింది. పశ్చిమజర్మనీప్రధాని అడెనార్ హర్షించాడు. దీనితో యూరప్‌చరిత్రలో కొత్త అధ్యాయం ప్రారంభం కాగలదని ఫ్రెంచి, జర్మన్, అమెరికన్ రచయితలన్నారు. కాని మిగతా యూరోపియన్లు మాత్రం అట్టే ఉత్సాహం కనపరచలేదు.

ఈ ప్రణాళిక అమలుజరిగినట్లయితే మిగతా విషయాలెలా ఉన్నప్పటికీ, ఫ్రెంచి జర్మన్ జాతులమధ్య యుద్ధం అనేది అసంభవమైపోతుందనే మాట నిజం. ఫ్రెంచి జర్మన్ పరిశ్రమలు ఒకే ఆధ్వర్యం క్రింద నిర్వహించబడుతున్నప్పుడు, ఏ ఒక దేశం రెండో దేశం అనుమతిలేనిదే యుద్ధ పరిశ్రమల్ని వృద్ధిపరచుకోలేవు. ఉభయులూ కలిసి మరొకరిపైన యుద్ధానికి సిద్ధపడ్డానికి మాత్రం ఇదివరకుకంటె బలమైన సైనిక దళాన్నీ యుద్ధపరికరాల్ని నిర్మించడానికి అధికావకాశం లభిస్తుంది.

ఫ్రాన్సులో బొగ్గు పరిశ్రమంతా ప్రభుత్వం అధీనంలో ఉంది. ఫ్రాన్సులో ఇనుము ఉక్కు పరిశ్రమలు, జర్మనీలో బొగ్గు, ఉక్కు, ఇనుముపరిశ్రమలు ధనికుల అధీనంలో ఉన్నాయి. లొరేన్ (ఫ్రెంచి) ఉక్కుపరిశ్రమకి రూర్ (జర్మన్) బొగ్గు, రూర్ ఉక్కు పరిశ్రమకి సార్ (ప్రస్తుతం ఫ్రాన్సు ఆధ్వర్యంలో ఉంది) బొగ్గు, ప్రాణావసరాలు. కాని బ్రిటిష్ ప్రభుత్వంమాదిరిగానే ఉభయ ప్రభుత్వాలూ వ్యాపారపు పోటీల్లో ఒకరికొకరు నష్టం కలిగించాలనే లక్ష్యంతో ధరల్ని రకరకాలుగా నిర్ణయించుకున్నారు. రూర్ బొగ్గుని జర్మన్ ఉక్కు పరిశ్రమదారులికయితే 3000 ఫ్రాంకులికీ, అదే లోరేన్ ఉక్కుపరిశ్రమదారుకయితే 6500 ఫ్రాంకులికీ అమ్ముతున్నారు. ఉక్కుపరిశ్రమలకి కావలసిన లోరేన్ ముడి ఇనుముని ఫ్రెంచిపరిశ్రమదారులే కమ్మే వెల పైన రెట్టింపువెలకి జర్మన్ పరిశ్రమదారులికి అమ్ముతున్నారు. అలా కాకుండా బొగ్గునీ, ముడి ఇనుమునీ ఫ్రాన్సు జర్మనీల్లో ఒకే ధరలకి అమ్మకం ఆరంభించినట్లయితే ఉభయదేశాల్లోనూ ఉక్కుధర నూరింట 25 వంతులు తగ్గిపోతుంది. దీనితో ఎగుమతి వ్యాపారం బాగా వృద్ధిచెందడానికి అపూర్వావకాశం లభిస్తుంది. ఫ్రాన్సు జర్మనీల్తో బ్రిటన్ కూడా చేరినట్లయితే పారిశ్రామిక ప్రపంచంలో రష్యా అమెరికాలమధ్య పశ్చిమ యూరప్ ప్రబలమైన రెండో వ్యాపార బలంగా వస్తుంది. 1949 లో బొగ్గు ఉత్పత్తి అమెరికాలో 44 కోట్ల టన్నులు, పశ్చిమ యూరప్ దేశాల్లో $41\frac{1}{2}$ కోట్ల టన్నులు, రష్యాలో $23\frac{1}{2}$ కోట్ల టన్నులు. ఉక్కు ఉత్పత్తి అమెరికాలో 9 కోట్ల 90 లక్షల టన్నులు, పశ్చిమ యూరప్‌లో $4\frac{1}{2}$ కోట్ల టన్నులు, రష్యాలో 2 కోట్ల 10 లక్షల టన్నులు. పశ్చిమ యూరప్‌లోకెల్ల బ్రిటన్ ఉత్పత్తి అత్యధికం. పశ్చిమ యూరప్‌లో ఉత్పత్తి అయ్యే మొత్తం బొగ్గు $41\frac{1}{2}$ కోట్ల టన్నుల్లో $21\frac{1}{2}$ కోట్ల టన్నులు బ్రిటన్‌లోనే ఉత్పత్తి అయింది. అలాగే ఉక్కు మొత్తం 9 కోట్ల 90 లక్షల టన్నుల్లో కోటీ 70 లక్షల టన్నులు.

అంటే రష్యానీ తూర్పుయూరప్‌నీ తలదన్నే బలమైన పారిశ్రామిక రాజ్యకూటాన్ని స్థాపించడం ఈ ప్రణాళిక ఉద్దేశమని స్పష్టపడుతోంది.

## కార్టెల్స్ *

ఈ ప్రణాళికపైన వచ్చిన విమర్శలో ముఖ్యమైనది: ఈ ఉన్నతాధికారసంస్థ తీరా పారిశ్రామికయజమానుల బలానికి లొంగి కార్టెల్‌గా మారిపోవచ్చుననేది. పారిశ్రామికులు వ్యాపారుల కుట్రలు ఇదివరలో అనుభవమే. ఇటువంటి కార్టెల్స్ యూరప్‌లో యుద్ధాత్పూర్వం ఉండేవి. ఒకే దేశంలో కాని కొన్ని దేశాల వారు కాని పారిశ్రామికవ్యాపారయజమానులు రహస్యంగా చేరి, అత్యధికలాభాలు గుంజుకోడానికి పన్నే కుట్రల్ని కార్టెల్స్ అంటారు. యుద్ధానికిముందు జర్మనీ, బ్రిటన్, ఫ్రాన్సు దేశాల మెరుగు ఉక్కు పారిశ్రామికులు ఈవిధంగానే కార్టెల్ నిర్మించుకున్నారు. అమెరికాలో ఇలాంటివి అనేకం ఉన్నాయి.

కార్టెల్ ఎలా పనిచేస్తుందో ఉదాహరణకి బ్రిటన్‌లో ఉక్కురేకుల్ని చూడవచ్చును. రేకుల ధర లెలా ఉన్నాయో షరతులేమిటో తెలుసుకోడానికి డజను కంపెనీలకి ఉత్తరాలు రాస్తాం. అన్ని కంపెనీలనించీ ఒకేధరలు ఒకేరకం షరతులు మనకు వస్తాయి. తీరా కొనవచ్చేసరికి డజను కంపెనీల్లోనూ పదకొండుకంపెనీలు ఫలాని సైజువి ఫలానిరకానివి మిగిలిన ఒక్క కంపెనీలోనే దొరుకుతాయని మనకి తెలియపరుస్తాయి. ఇంక బేరమాడ్డానికేనా వీలుండదు. ఆకంపెనీలతో ఎక్కడో సంబంధమున్న ఒకకంపెనీ ఓడల్లో రవానాచేసుకోడానికైతేనే అమ్ముతామంటారు. ఇలాంటివి అనేకహిరణ్యాక్షవరాలు కోరతారు. అన్ని కంపెనీలూ ఏకమై లాభం అధికంగా గిట్టించుకోడంకోసం, మంచి గిరాకీ పుట్టించడంకోసం చేసే తంతు అనేకరకాలు. ఆ కంపెనీలన్నిటిలోనూ కార్మికులకు జీతాలు ఒకేవిధంగా ఏర్పాటు చేస్తారు. ఫలాని మొత్తంకంటె ఎక్కువ ఉత్పత్తి చెయ్యకుండా నొక్కేస్తారు. ఎక్కడున్న ముడిసరుకునీ వీళ్లే ఎక్కువధరలకు కొనేసి

కలిసి కమ్యూనిస్టులతో పోరాడుతున్నారు

**తూర్పుతీరాన కొండలచాటున లోయల్లో**

ఉత్తరకొరియన్ కమ్యూనిస్టుబలాలు విశేషంగా కేంద్రీకరించబడుతున్నందువల్ల, వెంటనే ఫూసాన్‌రేవుకి ముప్పు కలక్కుండా కాపాడుకోడంనిమిత్తం జనరల్ మెకార్థర్ జపాన్‌లో నిలువరించబడిన అమెరికన్‌దళాల్లో ఒక దళాన్ని తెచ్చి యుద్ధనావలసహాయంతో పొహాంగ్‌రేవుదగ్గ దించాడు. జపాన్‌లో కల నాలుగుఅమెరికన్‌డివిజన్లలోను రెండుడివిజన్లు ఇదివరకే జనరల్ డీన్, జనరల్ చార్చ్‌ల అధిపత్యం పంపబడినాయి. వీనిలో ఒక దళం టేజాన్ నగరసమీపంలోనూ క్షేత్రరంగంలోనూ పోరాడుతుంది. రెండోదళం ఫూసాన్‌రేవు సమీపంలో కాపలా ఉంది. పరిస్థితి విషమిస్తున్నందువల్ల జపాన్‌దేశంలో ఒక్క డివిజన్ను మాత్రమే ఉంచి దైవంపైన భారంవేసి మిగతా ఒక్క డివిజన్ని పోహాంగ్ రేవువద్ద దించాడు. ఈ దళంలో రెండోప్రపంచయుద్ధ వీరులు, నీగ్రోలుకూడా ఉన్నారు. దిగినవెంటనే ఈ సేనలు ఉత్తరంగా పది మైళ్ళ దూరం లోయగుండావెళ్లి కమ్యూనిస్టుసేనల్ని ఎదిరించాయి. ఈ యుద్ధం ప్రారంభం కావడానికి ముందు ఇరవై నాలుగ్గంటలసేపు బ్రిటిష్ అమెరికన్‌యుద్ధనౌకలు యాంగ్‌డక్ నగరంపైన అగ్నివర్షం కురిపించి నగరాన్ని నేలమట్టం చేశాయి. ఆపైన అమెరికన్ సేనలు యాంగ్‌డాక్ నగరాన్ని ఆక్రమించుకున్నాయి. అగ్నివర్షం కురిపిస్తున్న సమయంలో లోయలో దాగిన కమ్యూనిస్టుసేనలు అమెరికన్‌సేన నగరం చేరగానే ముట్టడి ప్రారంభించాయి. ముట్టడి ప్రారంభమైన ఒకరోజులో అమెరికన్‌సేన యాంగ్‌డక్ నగరాన్ని విడిచిదక్షిణానికి వచ్చిన దారినే వెళ్లాయి.

[సూర్యనారాయణ]





శత్రువిమానాల రాకను కనిపెట్టడానికై దీక్షగా చూస్తున్న అమెరికన్ వైమానికదళంవారు.



ఉత్తరకొరియన్ కమ్యూనిస్టులపై అమెరికన్ తుపాకిదళంవారి భీషణమైన తుపాకికాల్పులు





ఉత్తర కొరియాలో కమ్యూనిస్టు దురాక్రమణకు పాలైన కొందరు అభాగ్యులు తలదాచుకోడానికై కాలినడకను గ్రామాంతరాలకు వెళ్ళిపోతున్నారు





జెనరల్ జె లాటన్ కాలిన్సు (ఎడమ వైపు) సమర్పించిన ఐక్యరాజ్య పతాకను ఆదరంతో స్వీకరిస్తున్న మెకార్థర్

కొరియన్ యుద్ధరంగానికై ఒకానొక రైల్వేస్టేషన్‌లో దిగుతున్న అమెరికన్ ఆయుధపరికరాలు



★

# కొరియా యుద్ధము

★

Regd No M 4479





కళాప్రపూర్ణ

శ్రీ॥ శే॥

కాశీనాథుని నాగేశ్వరరావుగారి

ఉత్కృష్టరచన

# ఆంధ్రవాఙ్మయ చరిత్ర

పరిశోధనపద్ధతిని, సంగ్రహరూపంలో నడిచిన సమగ్రసమీక్ష. వెయ్యేండ్ల వాఙ్మయ చరిత్రకు విశుద్ధదర్పణం. పాతచరిత్రల నన్నిటిని అవలోకన చేసి, సమన్వయించు క్రోడీకరించిన విపులమయిన చరిత్ర

శాసనాలలోనూ వాటిలోనూ అవ్యక్తస్వరూపంలో ఉండి ఉండి, నన్నయ ధర్మయా అని ఒక్కసారుగ దివ్యాకారంతో బైటపడి, నానాటికి నవనవోజ్జ్వలంగా వికసించిన మన వాఙ్మయం పోయిన పలుపోకడలను పోడిమితో చూపెట్టజాలిన ఉత్తమగ్రంథం

**వెల రూ. 2-0-0** **తపాలాఖర్చు 0-7-0**

---

## ఆంధ్రగ్రంథమాల

పోస్టుబాక్సు నెం. 212, మద్రాసు.

Edited, Printed & Published by S Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras